# కళాపాహాడ్

లేక

# నీలాచలము

(ఓఢ్రభాషనుంచి తెనిగించినది)

గ్రంథకర్త:

శ్రీపాద కామేశ్వరరావు

అభినవాంధ్ర
గ్రంథమాల
రాజమండ్రి
1926

ప్రకాశకుడు:

చిలుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్రగ్రంథమాలాలయము

రాజమండ్రి

1931

సర్వస్వామ్యములు
ప్రకాశకునివి

* * *

వెల రూ 1-0-0

# పీఠిక

ఓఢ్ర (ఉత్కళ) దేశము మనకు చాలా దగ్గరగా ఉన్నా పరిపాలనావిషయమున మనరాజధానికి వేరయినందున ఆ దేశచరిత్ర మనకు సుపరిచితము కాలేదు.

ఉత్తరహిందూస్థానము అక్బరుచక్రవర్తి పరిపాలిస్తూన్నప్పుడు ఉత్కళము ముకుందదేవుగజపతి అధీనమున ఉండెను. ఆ ప్రభువుక్రింద కొందరు సామంతప్రభువులు ఉండిరి. వీరిలో చాలామందికి ముకుందదేవన్న కన్నెఱ్ఱగా ఉండెను. సూర్యరశ్మి ఉన్నప్పుడు ఇతరగ్రహములూ తారలున్నూ కాంతి మాయడము సహజము. ముకుందదేవు అక్బరుచక్రవర్తికి మిత్రుడు. వంగదేశపుసుబేదారు సులేమాన్ విద్రోహము సల్పినందువల్ల ఆ కల్లోలమును అడచుమని అక్బరుచక్రవర్తి కొంతసైన్యము నిచ్చి ముకుందదేవుని పంపెను.

ఈ కార్యసంచయము ఆధారముగా చేసుకొని కటకపురి నివాసులు శ్రీమాన్ అశ్వినీకుమారఘోషుగారు "కళాపాహాడ్" అనుపేర నాటకము వ్రాసినారు. అది జనప్రియత్వము పడసినదని ఎరిగి దానిని తెలిగించుటకు వారి అనుమతిని మేము కోరగానే వారొప్పుకొన్నారు. ఆంధ్రులకీ నాటకము రుచింపకపోదని మా నమ్మకము.

20-2-31 చె॥ వేం॥

తత్క్షణమే తిరిగి వచ్చినారు. మా సేనానియైన కతలుఖాన్ మా యాజ్ఞాపాలన మొనర్చెనే కాని భయపడి పారిపోలేదు. అందుచేత ఆతడు సిగ్గుపడ నవసరము లేదు.

కత—మీ సేవకుడు తనకొరకై తల్లడిల్లలేదు. ప్రభువారి శుభ్రయశశ్చంద్రికకు మాలిన్యము సోకినందుకు చింతిస్తూన్నాడు.

అక్బ—ప్రభుభక్తాగ్రేసరా, మాతో కలిసి ఇంత కాలము మెలగుతూన్నా మా చిత్తవృత్తి నెరుగలేకపోతివి.

కత—ఎరుగలేకేమి? చక్కగా గుర్తించినాను. కఠిన శైలావృతమైన జలోత్సము వంటివారు ప్రభువువారు. కఠిన త్వచావృతమైన తరళపయఃపూర్ణపాత్రము వంటిది మీ హృదయము. మీరు పైకి పెద్దపులివలె భయావహరూపులు కాని పాలుతాగే బాలునికన్న మృదుస్వభావులు. పైకి ప్రచండ కిరణుని పగిది దీప్తికలవారైనా మీ కరములు శీతలములై మాసేవారి హృదయములు చల్ల జేయును.

వీర—ఖాన్‌సాహెబుగారూ! పాదుషావారియందున్న గొప్ప దోషము మీరు కనిపెట్టలేకపోయినారు. ఇది కొంత వరకు సృష్టిలోని లోప మనవచ్చును. కొన్ని చెట్లు రాపాడితే అగ్గి పుట్టును, కాని వాటి ఫలములు శరీరమునకు మంచి చలువజేయును. (అక్బరు మానసింహులు చిరునవ్వునవ్వుదురు)

కత—వీరబలా, నీ మాట నిజము. మానసింహామహారాజా! ఇవి పరిహాస వచనములు కావు.

అక్బ—రాజాసాహెబా! కతలుఖాన్ నిజముగానే సిగ్గుపడినాడు.

మాన—ముకుంద దేవు నోడించగలనని సాహెబుగా రనుకొన్నారు. అలాగైతే అతనితో తమ యాజ్ఞానుసారము మైత్రి నెరపియుండును.

కత—అది నా కిష్టము లేదు. ఉత్కళము వంటి సస్యశ్యామలము, రత్నాకరవిఘాతచరణము, నానావిధ కారుకార్య విమండితము, లక్ష్మీసరస్వతుల నిత్యలీలాభూమి ఏ రాజు కోరి విడిచిపెట్టగలడు? అదిగాక ఆ ముకుంద దేవుని వీరదర్పము చూర్ణము చేయక ఏ శూరుడు ఊరకుండగలడు?

(అందరూ పాదుషావైపు చూతురు)

అక్బ.—సేనానీ, ఇదా రాజధర్మము? ఇదా వీరత్వము?

కత—మహాప్రభూ, ఏలినవారు రాజనీతిపారంగతులు, నా బోటి అజ్ఞుడు మీతో నేమని విన్నవింపగలడు? ఐనా, నా దొక మనవి. రాజ్యము వృద్ధిచేయుడము రాజధర్మము కాదా? శత్రుదమనము వీరధర్మము కాదా?

సభాసదులు—మంచిమాట చెప్పినావు.

అక్బ—కతలుఖాన్! సభాసదులారా! ప్రతిద్వంద్వులైన పరరాజుల ధనము, రాజ్యము, సుఖశాంతులు దొంగవలె అపహరించి తన స్వార్థము నభివృద్ధి చేసుకొనుట రాజధర్మమూ కాదు, వీరధర్మమూ కాదు. రోగులు, శోకగ్రస్తులు, దీనులు,

దుఃఖార్తులూ మొదలగువాళ్ల దుఃఖములు తొలగించడము రాజనీతి గాని, వాటిని విడిచి బలహీనులగు రాజుల నోడించడ మేమి ధర్మము? ఏమి వీరత్వము? నా పూర్వులు నాకు ప్రసాదించిన సంపత్తి, రాజభక్తులైన నా ప్రజలు నన్ను విశ్వసించి నా కర్పించిన సింహాసనము—వీటిని పెంచి నేను రాజధర్మము నెరపువాడను కాను. పరమపవిత్రములైన వాటి రెండింటిని శత్రురక్తముచేత రంజిత మొనర్చి నా వీరత్వము స్థాపించను. నా తోడి రాజుల స్నేహముచేత నా పరిపాలనము నుజ్వల ప్రభా భాసమాన మొనర్తును. పుత్రతుల్యమైన ప్రజాగణమును సుఖశాంతివారిధారా ప్రవాహమున ముంచుతాను.

సభా—పాదుషావారికి మంగళ మగుగాక!

మాన—ఇందుచేతనే హిందూస్థానమందలి ప్రజలు అదృష్టవంతు లని భావించుకొంటున్నారు. ఇట్టి యుత్తమ రాజసేవ వీరపూజయున్నూ చేస్తూ పరమసుఖము నొందుతూన్నారు.

(సైనికుడు వచ్చును)

సైని—జయము జయము మహాప్రభూ!

మాన—ఏమి వార్తలు?

సైని—సులేమాన్ విద్రోహ మొనర్చినాడు.

మాన—సులేమానా!

అక్బ—మహారాజా! ఇదొక వింత కాదు. ఇట్లు జరుగుతుందని నేను చాలాకాలముకిందటనే ఊహించినాను.

కత—మహాప్రభూ! నన్ను మన్నించ వేడుతూన్నాను. ఈ సులేమాన్ కొంతకాలము ప్రభువుగారి నాశ్రయించగా మీరు దయార్ద్రహృదయులై అభయ మిచ్చి రాజ్యభిక్ష పెట్టినారు. అందు కిద్దా అతడు చూపిన కృతజ్ఞత!

అక్బ—కతలుఖాన్, నీ అభిప్రాయము బోధపడినది. ముకుంద దేవు కూడా ముందెప్పుడైనా సులేమాన్ వలె తిరుగబడునని సూచిస్తూన్నావు!

కత—చిత్తము.

అక్బ—సరే—ఇప్పుడు తగిన సమయము సంక్రమించింది—ఈ కల్లోలము నణచుటకై ముకుంద దేవుని నియోగిస్తే అతనిమైత్రిని పరీక్షించవచ్చును, కల్లోలము నణగదొక్కవచ్చును. కతలుఖాన్, నీవు కూడా కొంత సైన్యముతో ముకుంద దేవునికి సాయము చేయుము. సులేమాన్ తనఅల్లుడు కళాపాహాడ్పై నాధారపడి ఈ తిరుగుబాటు చేసినాడు. మన మతిజాగ్రత్తతో వ్యవహరించవలెను.

కత—చిత్తము. (తనలో) ఏమిది! పాదుషావారు నన్ను ముకుంద దేవుకన్న తక్కువగా పరిగణించినారు! కానీ ఎవ రెక్కువో ఇప్పుడు తేలగలదు. (వెళ్లును)

వీర—ప్రభూ! మానభంజనయాత్ర ముగియకముందే కంసమారణ మారంభించింది.

ఏకస్య దుఃఖస్య న యావ దంతమ్
ఉపస్థితో యం వేదనాంతరోపి॥　　(తెర వాలును)

## రెండో దృశ్యము

నవతలమున ముకుంద దేవు అంతఃపురము - భార్యాభర్తలు.

ముకు—ప్రియా! దుఃఖము వెంట సుఖము, విరహము వెంట సమ్మేలనము—ఎంత మధురము! ఎంత ఆనంద దాయకము!

రాణి—ఇది స్వర్గోపభోగము కంటె ఆనందకరము, సుధా పానముకన్న మధురతరము!

ముకు—ఈ మాధురి, ఈ ఆనందమున్నూ చాలా కాల ముండునా?

రాణి—ప్రాణేశ్వరా! ఎందు కీ అమంగళచింత? శాంతిమయమైన నా చిత్తమును కలతపెట్టెద రేల?

ముకు—నాకొక కించ కల్గుతూన్నది. దానికి హేతువు నాకే బోధపడలేదు.

రాణి—ఏమి టది?

ముకు—"ఇట్టి సుఖము ఇంత ఆనందమున్నూ మానవునికి కలుగడ మసంభవము; ఇది చిరస్థాయి కాదుసుమా" అని ఎవరో నా చెవిలో చెప్పుతూన్నట్లుంది. నా మర్మములపై నెవరో సుత్తితో కొట్టుతూన్నట్లు దుర్భరమైన క్షోభ కల్గుతూన్నది.

రాణి—అకారణముగా నీ సంక్షోభ మేమి? ఆనందామృతకుంభమున ఈ విషాద గరళ మెట్లుద్భవించెను? నీల

నభోగాత్రమున ఆకస్మికముగా ఈ నీలమేఘరేఖ ఎట్లు వచ్చెను! ప్రాణేశ్వరా! ముందేమి రానున్నదో?

ముకు—ప్రాణేశ్వరీ! దిగులు చెందకు. ఈ చాంచల్యమెంతోకాల ముండదు. ఈ మనోదౌర్బల్యము క్షణికము.

రాణి—నా కళ్లు తుడుచుట కిట్లంటున్నారు. మీరు మేరు సమానధీరులు, ప్రశాంతమహాసముద్రముకన్న స్థిరులు—మీకే దుర్భరమైన ఈ చాంచల్యము, ఈ దౌర్బల్యమున్నూ క్షణికములైనా సామాన్య కారణములచేత కలిగేవి కావు. తప్పకుండా ఇవి రాగల ఆపదలకు సూచనలు. అగ్నిపర్వతము పగిలినవెంటనే భూకంపము పుట్టితీరును.

ముకు—ప్రేయసీ, చింతిల్లకు. ఇప్పుడు మన కేమి భయము? ప్రబలప్రతాపశాలియైన పాదుషావారితో గాఢమైన మైత్రి చెలగునంతవరకూ మన కాపద తటస్థింప నేరదు. మొగలసేన ఉత్కళముపై దండెత్తి మనవారిశక్తి రుచిచూసి వెనుకకు మరలినదే, ఇక మన కేమి భయము? నీవు చింతించ నక్కరలేదు.

రాణి—అందుకే నాకు దిగులు. మీబోటి పరాక్రమవంతుడైన ప్రభువు పీకులకెల్ల కంటిలోని నలుసు కాడా?

ముకు—సత్యమే, కాని అక్బరుచక్రవర్తి రాజులకందరికీ ఆదర్శస్వరూపుడు లోకపూజ్యుడు. శత్రుమిత్రభేదము నెంచక వీరమర్యాద నెరపువాడు. మహానుభావుడు — అట్టివాడు మనకు భీతిగొల్పువాడు కాడు.

రాణి—కాని—

ముకు—ఈ మాటల కేమి — అటుచూడు — అస్తమించు సూర్యు డెంత శోభాయుక్తుడుగా నున్నాడో—సృష్టి అంతా అరుణరాగముచేత కప్పబడి కనులపండుగగా నున్నది. ఎంత మనోహర దృశ్యము !

రాణి—నాకీ దృశ్య మంత కమనీయముగా తోచ లేదు.

ముకు—(నిశ్చేష్టుడై యుండును)

రాణి—ఏ మాలోచిస్తున్నారు ?

ముకు—ఈ దృశ్యమునే చూస్తూన్నాను.

రాణి—చీకటిపడుతూన్నది. లోనికి పోదాము.

(దాసి వచ్చును)

దాసి—మహాప్రభూ! ఢిల్లీనుండి సైనికుడు వచ్చి "జరుగురుపని ఉన్నది, రాజుగారిని దర్శింప గోరుతున్నా" నంటున్నాడు.

రాణి—ఢిల్లీనుండి దూత! జరుగురు పని! ఇదేమై యుండునో కదా!

ముకు—బెంగపడకు ప్రాణేశ్వరీ...(వెళ్లును)

రాణి—కారణము లేక ఢిల్లీనుంచి దూత వచ్చునా ? క్రొత్తయుద్ధ మేదైనా సంభవించునా ఏమి ? మహారాజుగారి కల కల్లగాదుకాబోలు ! మా సమ్మేళనము క్షణికమై విరహ విషాదమున నంతరించునా ఏమి? ఈ నవతలగృహవాససుఖము

అరణ్యావాసదుఃఖముగా పరిణమించునేమో? వీరపత్నినై నందు కిదా నే పడే సుఖము!

(ముకుందదేవు వచ్చును)

ముకు—ప్రేయసీ, రా—నేడు మనకు పండుగ! వీరుని కర్హమైన వేషము వేసి నన్ను పంపుదువు గాని రా!

రాణి—ప్రాణేశా! అనుకొన్నట్లే అయింది!

ముకు—వీరపత్నివి నీకి దుఃఖము తగదు సుమా! వీరబాలవు కావా? ఏమింత పిరికితనము? మానవుని ప్రధాన ధర్మము కర్త—మానవుని ప్రధానసుఖము ఆత్మాహుతి!

రాణి—ప్రభూ! తెలిసింది—ఇంతతో మన ప్రేమాలాపన సమయము ముగిసి కర్తవ్యపాలనాసమయ మాసన్నమైనది—ఇక నా కేమీ చింత లేదు. ఢిల్లీ వార్త లేమి?

ముకు—వంగదేశపు నవాబు సులేమాన్ పాదుషా వారిపై తిరుగుబాటు చేసెనట. ఆ పితూరీ నణగదొక్కుమని పాదుషావారు నన్ను నియోగించినారు.

రాణి—ఆలస్యము వద్దు—మన విలాసములు కట్టిపెట్టి కర్తవ్యప్రవాహమున కాలు పెట్టండి. ఇట్టి సమయమందు నా కుచితమైన పని నేను కూడా చేస్తాను.

ముకు—ఇదీ వీరపత్నికి తగిన వాక్యము. రా, లోపలికి పోదాము.

---

## మూడవ దృశ్యము

ఆలోచనామందిరము—అబ్దుల్లా, రహమత్.

అబ్దు—సేనాధిపా, నేను పిరికివాడను కానా? నేను యుద్ధము చేయలేనా?

రహ—మీరు యువరాజుగారు. మీరే వీరులు కాకుంటే ఇంకెవరు వీరులు? మీరు యుద్ధము చేయలేకుంటే ఇంకెవ్వరు చేయగలరు? ఆనాడు మీరు వేటాడి వేటాడి చేయి కూడా నరుకుకోలేదా?

అబ్దు—అది చాలా కాలమునాటి మాట—ఇంకా నీకు జ్ఞాపకమున్నదే!

రహ—ప్రభువువారి కీర్తికి ప్రధాన స్తంభమైన ఇట్టి మహత్కార్యము మరపు వచ్చునా?

అబ్దు—అప్పుడు స్రవించిన రక్తప్రవాహము నీవు చూడలేదా? దాని నణుమాత్రమైనా లక్ష్యపెట్టినానా?

రహ—అణుమాత్రమంటారా? అసలే లక్ష్యము చేయలేదు. మీ రప్పుడే మూర్ఛపోయినారు, ఇక లక్ష్య మెక్కడ?

అబ్దు—మరొకడైతే వెంటనే మరణించడా?

రహ—సందేహమేమి? వెంటనే యమలోకమునకు పోయి యుండును.

అబ్దు—అలాగైతే—నావంటి వీరు డుండగా మా కక్కగారు తనకూతురు దూలియాను కాఫిర్ కిచ్చి పెళ్లిచేసినా రేమి?

రహ—దానికి కారణము లేకపోలేదు. స్త్రీజాతి సహజముగా కోమలమైనది. అందు యువరాజ్ఞి అతికోమలమైనది. అట్టిదానిని ప్రభువుగారి కిచ్చి పెళ్లిచేస్తే ఆమెకు ప్రాణాపాయము కల్గునేమో అని సుల్తానుగారు సందేహించినారు.

అబ్దు—చక్కనిమాట చెప్పినావు—సేనాధిపా, దూలియా వెన్నబొమ్మవంటిదే, కాని ఆమె నేను ధైర్యశాలిని కానని అన్న దేమి?

రహ—పరియాచకమున కని ఉంటుంది. ఆమె నిన్ను పెళ్లి యాడదు. నిక్కా చేసుకొంటుంది. అందుకోసమట్లు హాస్యమాడింది.

అబ్దు—అంతే, అంతే. నేను ధైర్యశాలిని కానని హాస్యమాడినది. అననీ, అననీ, ఎన్నిసార్లైనా అననీ—నే నామె కంటికి ధైర్యహీనుడను, దగాఖోరును, చేతకానివాడను...సరేకాని ఆమె మనస్సుకి నేను నచ్చినాను కదా, ఆమాట నాతో చెప్పడాని కామె కెందుకూ జంకు?

రహ—జంకు కాదా? ఆ కాఫి రుండగా మీ యెడల బిడియ ముండదా?

అబ్దు—ఔనౌను—నే నేమి చేయవలెను? ఏమి ఉపాయము?

రహ—ఉపాయము లేకేమి! మీ చేతిలోనే ఉంది.

అబ్దు—నా చేతిలోనా? చెప్పు, చెప్పు. చేయడానికి తయూరుగా ఉన్నాను. దూలియాకొరకు ప్రాణ మిమ్మన్నా ఇస్తాను. ఆహా! దూలియా! దూలియా!

రహ—నవాబుగారు వచ్చే వేళయింది. తరువాత ఈ విషయము గురించి ఆలోచింతాము.

అబ్దు—దూలియా! దూలియా! (పోవును)

రహ—ఈ నిరర్థకునివల్లనే నాకు కార్యసిద్ధి కావలెను. ఇంత అవమానమా! కాఫిరా మొగల సేనాచక్రము తిప్పే వాడు? కులీనుడనైన నేను వాని ఆజ్ఞానువర్తినై పడి యుండ వలసినదా? ఉచ్చవంశజుడను, సాటిమహమ్మదీయుడను, వీరు డను, సర్దారును—ఇట్టి నేను హిందువుకు కర్మచారిని కావ లెనా? నీచుడైన కాఫిరుకింద నౌఖరుగా నుండవలెనా? ఇంత కన్న నాకు చావు మేలు. ఏదో తీరున కళాకౌశలముచేత పితూరీ లేపినాను కదా? నా కన్ని విషయములా పోటీదారు నీలాచలము ఈ విద్రోహాగ్నిలో బడి మండిపోవలెను; లేదా నూతనగౌరవముచేత ఉద్భాసితుడై ఇంకొకమెట్టు యశః సోపానమున ఎక్కవలెను...ఆఁ. ఇత డెంతకాలము జీవించ గలడు? అబ్దుల్లా బాకు అను క్షుణమూ అతని రక్తము రుచి చూడవలెనని ఉవ్విళ్లూరు తూన్నది. వీనికి కాలము సమీప మందే ఉన్నది.

(నవాబు వచ్చును.)

నవా—రహమత్, నేను విన్నమాట నిజమేనా?

రహ.—ఏమి మాట ప్రభూ?

నవా.—ఈ తిరుగుబాటుకి మూలకారణము నీవట? ...ఈసంగతి సేనాధిపతియైన నీలాచలముతో ఆలోచించి నావా?

రహ.—ఆలోచ నెందుకు? మన సైనికులు, కృషకులు, వర్తకులు, సమస్తప్రజలూ మొగలాయీ ప్రభుత్వ మన్న రోతపడుతూన్నారు. ఇది సహజమౌనో కాదో మీకే అనుభవసిద్ధము — జన్మభూమి పరాధీన మగుట కెవ్వ రొప్పుకొంటారు? మీరు ప్రభువులుగా నుండవలెనని అందరూ ఒప్పుకొన్నారు.

నవా.—నాకూ అదే కోరిక. కాని మొగలాయి ప్రభుత్వముపై కత్తికట్టటంత శక్తి మన కున్నదా?

రహ.—లే కేమి? మన సర్వసేనాధిపతి నీలాచలము భుజవీర్యము అపారమనీ, అతడు భరతఖండమంతా జయింప సమర్థుడనీ ప్రభువుగారే పలుసార్లు చెప్పియున్నారు.

నవా.—అతనికి సమ్మతమైన యుద్ధములపట్ల అది నిజమే, కాని ఈవిద్రోహమున కాతడు సమ్మతింపడని తెలియ వచ్చినది.

రహ.—(తనలో) అతడు సమ్మతింపడనేకదా ఈ విద్రోహము రేపినాను.

నవా.—(తనలో) ఒక్క విషయమున ఈ విద్రోహము మంచిదే. పరాధీనత ఎవరు చిరకాలము సహించగలరు?

(పైకి) నీలాచలము సహాయము లేకుంటే ఇందు నెగ్గడము అసంభవము. అతని నొప్పించ లేమా ?

(నీలాచలము వచ్చును)

ఇదిగో అతడే వచ్చినాడు. ఇప్పుడు కర్తవ్య మేమి ? సేనానీ!

నీలా—చేయవలసినది రహమత్ ఎరుగును. సహాను తాలీ! అవిమృశ్యకారివై విద్రోహబీజము నాటినావు, ఎవరితో కయ్యమునకు కాలుదువ్వుతున్నావో ఎరుగుదువా? సాగరతుల్యమై అమితమైన మొగలసేన ఎక్కడ? గోష్పద తుల్యమై పిడికెట నిమిడే నవాబుసైన్య మెక్కడ? అఖిల భారతఖండమున కేకఛత్రాధిపతియైన మొగలసార్వభౌము డెక్కడ? వంగదేశాధీశుడైన నవా బెక్కడ? ఇట్టి విద్రోహ మెన్నడైనా గట్టెక్కుతుందా? ఈకార్యము సముద్రశోషణమువలె అసాధ్యము కాదా? దీని పరిణామము మన కెంత అనర్థదాయకమో కొంచె మూహించినావా?

రహ—లోకైకవీరుని నోట భీరువచనములు వెడలుతున్నవి! ముసల్మాన్ నోట కాఫిర్ మాటలు వస్తున్నవి!

నీలా—ఇవి కాఫిర్ మాటలే, రహమత్, కాని వీరాలాపములే సుమా! ఇట్టి విద్రోహప్రసంగమే భీరుతాసూచకమని కాఫిరుల మతము సుమా! వాళ్లు బహిరంగముగా ధర్మయుద్ధము చేసేవారు కాని రహస్యాచరణమూ కూటనీతీ వారికి రుచించవు—కాఫిరా! ఈశ్లేష ఎవ్వరియెడ? ఆసేతు హిమాచలము వ్యాపించియున్న హిందూజాతులకెల్ల ఆదర్శ

రూపమున వెలసి జగత్తంతటికీ జ్ఞానాలోకము ప్రసాదించిన ఆర్యజాతియెడనా ఈ అయోగ్యప్రసంగము? ఆజాతి భీరువా? అది అసభ్యమా? ఎంత అధఃపతనము!

నవా—కళాపాహాడ్! ✓

నీలా—నవాబ్ సాహెబా!

నవా—నీ వే పక్షమున పల్కుతూన్నావు?

నీలా—స్వ పక్షమున, స్వజాతిపక్షము సమర్థిస్తూన్నాను.

నవా—స్వ జాతియా? వి జాతియా?

నీలా—(తనలో) వి జాతియా! నా స్వజాతి యేది? నాకు స్వజాతి లేదా? బంధువులు లేరా? హిందూజాతి నా స్వజాతి కాదా? నా స్వజాతి బ్రాహ్మణజాతి కాదా? ఆ పర్ణకుటీరము నా కావాసము కాదా? ఆ వృద్ధస్త్రీ నాకు తల్లి కాదా? ధర్మనిష్ఠయు పతిప్రాణయునైన ఆ తిలోత్తమ నా భార్య కాదా?

తెరలో—ఔను.

నీలా—ఔనా?

తెరలో—హా హా హా! వ్వా వ్వా

నవా—నీలాచలము!

నీల—నీలాచలము! నీలాచల మెవడు? నేను కళాచంద్రుడను. కనబడ లేదా? నేను బ్రాహ్మణుడను, కర్మిష్ఠిని—పంచ యజ్ఞములు అనుదినమూ కావించి దైవారాధన చేసేవాడను.

నిరామిషాహారమున జీవితము గడిపేవాడను. నా ఆచార వ్యవహారము లిప్పటికిని హిందూ సంప్రదాయప్రకారమే నడుపుతూన్నాను. పేరుమాత్రము మార్చనేల? నా పేరు నీలాచలము కాదు, నేను తురకను కాను. నేను హిందువుడను, నా పేరు కళాచంద్రుడు, కళాపాహాడ్ కాదు.

నవా—నీలాచలము! నీమతి కొంచెము చెడినట్లుంది. ఇదంతా చాలా కాలమునాటి గొడవ.

నీలా—చాల కాలము నాటిదా? ఇప్పుడు నే నెవడను?

నవా—నీవు ముసల్మానుడవు. పరమపవిత్రమైన ఇస్లాముమతావలంబుడ నైన నా అల్లుడవు.

నీలా—అలాగా! తురకనా! హిందువును కానా? (తనలో) హిందువు! ఈమాట వినగానే ఎన్ని విషయములు జ్ఞాపకము వస్తూన్నవి!—ఎంత విశ్వాసఘాతుకుడను! ఎట్టి పాపిని! స్వార్థమదాంధుడనై ఎట్టి క్రూరకర్మ చేసినాను! ఏమి సాధనము?—ఏమి గతి? (పైకి) మహాప్రభూ! ఇప్పుడు నేను సెలవు తీసుకొంటాను. నాతల తిరుగుతూన్నది.

(వెళ్లును)

నవా—రహమత్! నీలాచలము మతి ఇట్లు మారిన దేమి? ఇతని చిత్తవృత్తి నాకు బోధపడలేదు.

రహ—ఏమైన నేమి? కాఫిరుని మీరు విశ్వసించి ఏ నా డతనికి కూతురునిచ్చి పెళ్ళిచేసి సర్వసేనాధిపత్య మిచ్చినారో ఆ నాడే పొరపాటు జరిగింది. చేయి కాలిన తరువాత

ఆకు పట్టుకొంటే ఏమి లాభము? మన మతిజాగరూకులమై ఉండడము మంచిది.

నవా—రహామత్, ఈపితూరీకి నీవే కారకుడవుగా?

రహా—మహాప్రభూ! ఆ మాట నిజము.

నవా—ఇప్పుడు కార్యము సానుకూలముగా నడిపించే పూచీ నీది.

రహా.—నీలాచలము లేకుంటే యుద్ధము సానుకూలముగా జరుగదని మీ ఊహ. మేమంతా వీరులము కామా? మేము యుద్ధము చేయలేమా?

నవా—సరే—సేనాధిపత్యము నీకే ఇచ్చినాము. ఇదిగో ముద్ర—నీలాచలము చిత్తవిభ్రమమునకు హేతువేమి? అతని స్వస్థత ఎందుచేతనో కాని చెడినది. ఇప్పుడే వైద్యుని రప్పించి చికిత్స ప్రారంభించవలెను. అతను లేకుంటే మనకు జయము చేకూరదు... ప్రాణాధికమైన దూరిగూడు నాకున్నా అతనితోడిదే లోకము. (పోవును)

రహా—వాహ్వా! ఏమి ఆనందము! సేనాధిపతిని నేను. ఆ మూర్ఖునికి మతి పోయింది. ఇక వాడు బాగుపడడము కల్ల. వాడు బ్రతికి ఉన్నంతకాలము నేను నిశ్చింతుడను కాజాలను.

(పోవును)

---

## నాల్గో దృశ్యము

### రాదారి—ముకుందదేవు సైనికులు.

సైనికుడు—మహారాజా! ఆకలి! ఆకలి! కడుపు మండిపోతూంది — ఇక భరించలేము. సెలవిచ్చితిరా లూటీ చేసి తినుబడి సామగ్రి సంపాదించు కొంటాము.

ముకు—వీరుల కది తగిన పని కాదు.

సైని—మహాప్రభూ! ఇది శత్రువు దేశము.

ముకు—శత్రువుని రాజ్యమే కావచ్చును. కాని ఈ గ్రామవాసులు మనకు శత్రువులు కారే!

సైని—వీరి రాజు మనకు శత్రువు.

ముకు—నిజమే! నిరపరాధులైన ఈ ప్రజలు కూడా మనకు శత్రువులా? ఈ జనులు ఎంత కష్టమును సైచినారు! ఎంతో శ్రమకోర్చి, ఎంతో కష్టపడి, స్వార్థము త్యజించి దేశ ప్రజలకు భోజనపదార్థములు సిద్ధము చేసినారు, రాజు వైభవము పెంపొందించినారు. ఏమి ఉదారహృదయులు! ఒక నాడైనా విశ్రాంతి ఎరుగరు. వీళ్లు పడ్డ శ్రమకు పురస్కారమేమి లభించినది? వీరు చేసిన మహోపకారమునకు ప్రత్యుపకార మేమి ప్రాప్తించినది? అం తెందుకు? యుద్ధము సన్నద్ధమైనదని రాజుగారి పిలుపు రాగానే న్యాయాన్యాయములు ధర్మాధర్మములు ఎంచక నిర్లక్ష్యభావముతో మిడతలవలె సమరానలమున దుమికినారు, ప్రాణత్యాగమున కందరూ

సిద్ధపడినారు. ఇట్టి సాధు ప్రజాగణము—పుత్రుల కన్నా ప్రాణముల కన్నా ప్రీతిపదమైన జనసామాన్యము ఎన్నడైనా ఘృణార్హ మగునా? ఇట్టి వారిపై మనకు పగ తగునా?

సైని—ఏమి చేయు మన్నారు? ఆకలిబాధ భరింప శక్యము కాకున్నది.

ముకు—ఎట్లో ఇంతవర కోర్చినారు—క్షణకాలము ఓపికపట్టండి — వెళ్లిన దూత తిరిగి రానీయండి.

(సైనికుడు వచ్చును)

2 సైని—మహాప్రభూ! దూత వచ్చినాడు.

ముకు—రసదు వచ్చి చేరినదా?

దూత—(ఊర కుండును)

ముకు—తెలిసింది. మన ఆశ భంగ మైనది. ఏమి సాధనము? సైనికులారా! మన సేనలోనున్న గుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు మొదలైన వాటిని అమ్మి ఆ ధనముతో ఆహారపదార్థములు కొనండి. లేకుంటే వాటినే తినండి.

సైని—(నివ్వెరపడుదురు)

ముకు—ఇటుపై నేమి చేయగలను? యుద్ధ మేలాగు చేయడము? — సైనికులారా! ఇచ్చటి గ్రామస్థుల కే విధమైన బాధ కలుగనీయకండి, జాగ్రత్త!

సైని—చిత్తము.

ముకు—దూతా! తినుబడి సామాను వచ్చే జాడ కనబడలేదా?

దూత—బళ్లేమో వచ్చినవి—వాటి జాడలు కనబడ్డవి.

ముకు—ఆబళ్లేమైనవి? ఎటు పోయినవి?

దూత—ఇక్కడి కరకోసువరకూ బళ్లు వచ్చినవి. జాడలు నేను చూసినాను.

ముకు—పిమ్మట ఆ జాడ లేమైనవి?

దూత—ఆతరువాత ఇటువైపు జాడలు లేవు. అడవి వైపు పోయి అదృశ్యమైనవి?

ముకు—అడవివైపు పోయినవా? అలాగైతే ఆ బళ్లు ఆ సామగ్రి నీ దొంగలపాలైనవి....అవి మాయమై పోవడము శాత్రవుల కౌశలముచేతనా, లేక మనవాళ్ల భ్రాంతి వల్లనా?—నీవు అడవివైపు వెళ్లినావా?

దూత—అంతలో చీకటి కమ్మినందున పైకి పోలేదు. రేపుదయ మా భోగట్టా ప్రభువుగారికి నివేదించుకొంటాను.

ముకు—నేటికి గుర్రములు తిని కుక్షి నిండించుకొన్నారు. రేపటిమాట లేలాగు? కడుపు మాడుతూంటే కదనమెటు సాగుతుంది? కతలుఖా నింతవరకూ రాకపోవడమునకు హేతు వేమి? ఇదివరకే వచ్చియుండవలెనే పాదుషా ఆజ్ఞా ప్రకారము.

(సైనికుడు వచ్చును)

సైని—మహాప్రభూ! శుభవార్త! ఇచ్చటి రాజుగారు మావద్ద సొమ్ము పుచ్చుకోకుండా ఖాద్యపదార్థము లిచ్చినారు.

ముకు—జగన్నాథస్వామి ప్రసాదము! ఆ మహా రాజుగారెక్కడున్నారు?

సైని—ఆయన కడువృద్ధు, నడువలేరు. మిమ్ము సాదరాభ్యర్థనాపూర్వకముగా తీసుకొనిపోయి. గౌరవించడానికి తగిన ఏర్పాటులు కావిస్తూన్నారు.

ముకు—ఏమి ఆయన నిర్వ్యాజకటాక్షము! సైనికులారా, వా రిక్కడికి రాకముందే వారి దర్శనము చేసి ధన్యుల మౌదాము. నీలాచలనివాసా! నీ కరుణ అమేయము. మేమే చిక్కులూ పడకుండా కతలుఖాన్ త్వరలో మాకు సాయమయ్యేటట్లు వరము ప్రసాదించుము. (అందరూ పోవుదురు, కతలు వచ్చును)

కత—ఇదిగో వచ్చినాను. వహ్వా, నా పాచిక బాగా పారింది. ముకుంద దేవా, నీవు సపరివారము తిండిలేక మడిసే యత్నము చేసినాను. మీ రసదుశకటము లన్నీ నా అధీనమున ఉన్నవి, నీ ప్రాణాలు నా చేతిలో నున్నవి. ఇక నేలాగు బ్రతికి పోవుదువో చూస్తాను. ఈ యుద్ధములో గెల్చి మేము చూస్తూండగా పాదుషావారివద్దనుండి పారితోషికము పుచ్చుకొందామని కులుకుతూన్నావు కాబోలు? మొగలు దర్బారులో వేలకొద్ది ముసల్మాను సర్దారులుండగా ఒక కాఫి రింత గౌరవమునకు పాత్రుడు కావడము మహమ్మదీయులకు మర్మ వ్రణమువలె నిర్భరము కాదా! మేము శూరులము కామా? ముకుంద దే వెంతచేతకానివాడో పాదుషా వారి కీసారి

బోధపడగలదు. తినుబండారము చక్క చేసుకోలేని సేనాధిపతి ఏమి సమర్థుడు? నా ప్రతాపముకూడా ఇప్పుడు జగద్విదిత మవుతుంది, విద్రోహదమనము నేనొక్కడనే చేసినానని వారు భావించక తీరదు. నీవు భుజబలమువల్ల సాధించిన దానిని నేను బుద్ధిబలముచేత నా కారోపించుకొంటాను. ముందీరహమత్ ఖానును చేత జిక్కించుకోవలెను. ఆలస్యముచేయరాదు.

## ఐదో దృశ్యము

శయనమందిరము.

(దూలియా ముత్యాలహారము కూర్చుతూన్నది)

ఫిరోజా—దూలియా! మొగమున సింధూరతిలకము, చేతిని గాజులు, కట్టుకొన్నది జల్తారుచీరె—ఆహా! నీకెంత తగి యున్నవే!

దూలి—నా ప్రాణవిభుడు హిందూసంప్రదాయము రీతి ఆచారవ్యవహారములు జరుపుతూండడము నీవు చూడ లేదా?

ఫిరో—అందుకా నీవీ వేషము దాల్చినావు?

దూలి—పతిమనోరంజనమే కదా పత్నికుత్తమకర్త వ్యము? పతిప్రేమ పరమపవిత్రము.

ఫిరో—ప్రేమ అంటే నీకే తెలుసును కాబోలు! లేకుంటే పాదుషాను పెండ్లియాడవలసిన నీవు హిందువును పెళ్లాడుదువా? నీ రూపమంతా ఇట్లు చెడగొట్టుకొందువా?

దూలి—అలా గనకు ఫిరోజా! ఈ మాటలు నా చెవు లకు మనస్సునకూ శూలాయమానములుగా నున్నవి. ప్రేమ జాతి నెంచదు, ధనము చూడదు, మతము గణించదు.

ఫిరో—మొట్టమొదట చూచినప్పు డత డింత సుందరుడు కాడు కాబోలు? తిండికి లేక చిక్కి సగమై, కట్టుకొన మంచి దుస్తులు లేక బికారివానివలె ఉండెను. అతనియం దే గుణము చూచి త్వత్ప్రేమాంబుధిలో పడ్డావు?

దూలి—అంతరంగము స్వభావ మంతరంగమే ఎరుగును.

ఫిరో—అదేమో నీ మనోవృత్తి నాకు బోధపడలేదు. నే నైతే ప్రేమాంబుధిమాట దైవ మెరుగును, ఒకసారి కన్నువిచ్చియైనా అతనిని చూసి యుండను.

దూలి—ఇప్పుడో?

ఫిరో—ఇప్పుడు కొంత మెరుగు. అత డుత్తమ పండితుడు, అసమాన వీరుడు, అత్యంత సాధుశీలుడు—నీకు తగిన వరుడే.

దూలి—మొదట చూచిన నాడు నీ కత డిట్టివాడని కొంచెమైనా తట్టలేదా?

ఫిరో—ఎద్దు కేమి తెలుసును అటుకుల గూచి? దూలియా, నీకు సవతి ఉన్నదట.

దూలి—ఔను. ఆమె పేరు తిలోత్తమ.

ఫిరో.—ఇప్పుడు ఆమె ఊసే తలపెట్టడేమో ఇతడు?

ఇం కెందుకు తెలుస్తాడు? మకరంద మాధుర్యము గ్రోలు మధుపము మదనములకు బోవునా?

దూలి—అలాగు కాదు. శీలోత్తమ పతివ్రతోత్తమట—నాకన్న అధికత్తె అట—మేమిద్దరమూ కలిసి యున్న మేలు—ఆమె పట్టుదలగల హిందువు—పతి యామె నెంత నిరాకరించినా ఆమె తన ధర్మము విడువలేదు; మా అత్తగారు తనయుని దగ్గర రానివ్వలేదు. ఆహా! నే నామెకు సేవ జేస్తూ దగ్గరనుంటే ఎంత భాగ్యశాలిని నౌదును!

ఫిరో—ఎంతలో హిందువుగా మారిపోయినా వమ్మా! వేషమున—భూషణములయందు—భావమున—అచ్చమైన హిందూభామినివై నావు.

దూలి—ఈ హార మెంతో జాగ్రత్తతో కూర్చినాను గాని ఇంపుగా లేదు.

ఫిరో—ఎందుకుంటుంది? ఆయన వచ్చేవేళయింది. నేను పోతాను, నా కెన్నో పనులున్నవి. నాన్నగారికి పక్క వేయలేదు. (పోవును)

(నీలాచలము వచ్చును)

దూలి—నాథా! ఈ హారము బాగుందా?

నీలా—నీవు కూర్చిన హారము బాగుండదా నాకు? నీవు చేసినదంతా నాకు నచ్చుతుంది. ఏదీ ఇలాగు తే.

దూలి—(హారమిచ్చును)

నీలా—ఇది బాగానే ఉందికాని ఇంతకంటె ప్రియ తరమైన హారి మిస్తావా ?

దూలి—మీా కాటంకమా ?

నీలా—(దూలియాచేతులు తన మెడకు తగిలించు కొనును) దూలియా ! ప్రేయసీ ! ఇట్టి ప్రేమా ఇట్టి ఆదరమూ మానవస్త్రీవల్ల లభించదు. నీవు మనుష్యమాత్రురాలవు కావు సుమా దేవీ స్వరూపిణివి. ఆహా ప్రేమనిధీ, నా హృత్ప్రితిమా! ఏదీ నీ ప్రేమాలింగనము...నీ ప్రేమామృతముచేత నన్ను ఉన్నతుని చేయుము. నా పూర్వవృత్తాంతము మరచిపోతిని. నా కొక భార్య ఉందనీ, నా కొక ముసలితల్లి ఉందనీ మరచి నాను. నేను హిందువు ననే జ్ఞప్తి లేదు. నా జాతిని, జననిని, బంధుజనమునూ పోగొట్టుకొంటిని—వాటికి మారుగా ఆద రము లభించింది, భార్య దొరికింది, ప్రేమా, అనురాగమూ ప్రాప్తించినవి. ఇందుకు చింతించడ మెందుకు, కుందడ మెం దుకు ?

దూలి—నన్ను పొగడి నా చిత్తమును క్షోభపెట్ట వద్దు. నాకు ప్రేమఅంటే తెలియదు, ఆదరము తెలియదు. నే నెరిగిన దొకటే—మీారు నా నాథులనీ, మీాకు నేను దాసి ననీ, నేను మీాకు తగినదానిని కాననీ ఎరుగుదును.

నీలా—ఈ వినయ మతిరమ్యము. ఏమి గంభీర ప్రేమ!— ఏమి సహజస్నేహము ! ఇక్కడ జాతిచర్చ ఎందుకు ? తిలో త్తమా ! ని ప్రేమ ఇంత సాంద్రమా ? నీకన్న దూలియా

ఎంత ఉదారస్వభావ!...అమ్మా! నీవు నాయెడల చూపిన ఆదరముకన్న దూలియా చూపిన స్నేహ మెంత స్నిగ్ధమో చెప్పజాలను. ప్రేమమయీ! స్నేహమయీ! నా హృదయము ప్రేమార్ద్రి మొనర్చుము. సంకీర్ణములైన నా మనో భావములు విస్తరించునట్లు చేయుము.

(దూలియాను కౌగిలించును.)

దూలి—ప్రాణేశ్వరా! చాలా రాత్రి అయినది. మీ దేహము స్వస్థముగా లేదు.

నీలా—ప్రేయసీ! అపారమైన ప్రేమలో నన్ను ముంచిన నీ కింక వేరు చింత ఎందుకు? నేను నిద్రపోతాను, నీ వభ్యంతరమునకు పోవచ్చును.

(ఆమె వెళ్లును.)

(ఛాయారూపమున తిలోత్తమ వచ్చును.)

తిలో—ప్రభూ!

నీలా—ఎవరు నీవు? తిలోత్తమా! ఇక్కడి కెందుకు వచ్చినావు? నీచిత్తము మారినదా ఏమి? నీ భ్రాంతి పోయిందా? రా, నాతో కలిసియుందువుగాని. నీ కేచింతా ఉండ నక్కర లేదు. నీ వేరీతిచొప్పున నున్నా నా కిష్టమే.

తిలో—అదే మాటా? నాథా! హిందువునైనా ధర్మము త్యజింతునా? కోడలినై అత్తగారి నోంటిగా విడువగలనా?

నీలా—పత్నివై పతిని త్యజించగలవా?

తిలో—అదీ నాచేత కాదు. స్థూలశరీరసంపర్కము విడిచితినే కాని సూక్ష్మమును విడనాడుదునా? నా శరీరమునకు వియోగ మంటును గాని నా మానసమునకంటదు, అది సంతతము మీయందే లగ్నమై ఉన్నది.

నీలా—దూలియా ప్రేమ ఎట్టిదో చూచినావా? నేను హిందూమార్గ మవలంబిస్తే ఆమె దాని నవలంబిస్తుంది; నేను మహమ్మదీయసంప్రదాయము నవలంబిస్తే ఆమె దానినే అవలంబిస్తుంది. ఆమె ప్రేమ ఎంత అకృత్రిమమో ఎంత పవిత్రమో కొంచె మూహించు. నీ కట్టిప్రేమ నాపై నుందా? ఆమె ఆదరించిన ట్లాదరించగలవా నీవు?

తిలో—నా ఆదరమా! నాప్రేమ ఎట్టిదో మీకు తెలుసునా? నా హృదయము ముక్కలుచేసి చూడండి, మీకే బోధపడుతుంది.

నీలా—ఓహో! ఏమి యీవింత? ఏమి టిది నా కళ్ల యెదుట?

తిలో—కనబడ్డదా?

నీలా—చూచినాను, తిలోత్తమా, చూచినాను.

తిలో—ఏమి చూచినారు?

నీలా—నా పేరు! నా రూపము! నాపై ధ్యాస!

తిలో—నా ప్రేమ ఏలాటిదో తెలిసిందా? ఆదరము నావల్ల లభిస్తుందా? వితాకు చెందుతూన్నా రేమి?

నీలా—నీ అంతరంగ మింత సుధామయమా! అట్లైన నీ బాహ్యావ్యవహారమున ఇంపు లేదేమి?

(తిలోత్తమ అంతర్ధాన మగును)

(ఛాయారూపమున వృద్ధస్త్రీ వచ్చును)

వృద్ధ—ఇం పెందు కుంటుంది? నీ కామెయెడ ప్రేమ ఉంటేకదా ఆమెకు నీపై భక్తి! నీ తల్లియెడ నీవు కర్తవ్య పరాయణుడ వైతే నీభార్య నీయెడ కర్తవ్యపరాయణయై ఉంటుంది. యువజనసామాన్యమైన రూపలాలసచేత ముగ్ధుడవై నీ ధర్మపత్నిని త్యజించినావు. ఇదేమి పౌరుషము? నీవు పండితుడవో? వైభవము చూసి కళ్లుచెదిరి మతిపోగొట్టుకొన్నావా? నీ తెలివితేట లేమైనవి? రూపవిభవములు శాశ్వతము లనుకొన్నావా? జ్ఞానహీన అబల అయిన ఈ బాలికను చూసి నీవు చాలా నేర్చుకోవలసి ఉంది. ముదుసలి నైన నాకు నీ వే మవుతావు? ఏక పుత్రుడవు—నా దుఃఖమున కెల్ల సాంత్వనము! శరీరపటుత్వము తప్పిన నాకు ఊతకర్ర! గళి తాంగిని క్షీణమతి నైన నా కిప్పు డెవరు దిక్కు? జన్మప్రభృతి నీ జీవిక కాధారమైన స్వధర్మమును విడిచి పరధర్మమునకు బలి వైనావు. నీవు పుట్టినప్పటినుండి నిన్నాదరించిన స్వీయ సంఘమునకు వెలియై నన్నేకాకిని చేసి తురకలలో చేరి నావు! ఈ పృథ్వియందు నాకూ నీకూ సంబంధము లేకుండా చేసినావు. కర్తవ్యదృష్టిని నీవు నాకు పరమశత్రువు వైనావు.

నా హృదయమును చీల్చి చూసితివా అందు నీమూర్తి కన బడును. నాజిహ్వాయందనుక్షణమూ నీ పేరే వర్తిస్తూన్నది.

నీలా—అమ్మా! అమ్మా!

వృద్ధ—నీ మోహమేఘమాల ఛేదించి చూడు; అజ్ఞానాంధకారము తొలగించి చూడు—సత్య మేది? మిథ్య ఏది? అమృత మేది? గరళ మేది? (పోవును)

నీలా—(మంచముమీదనుండి లేచి) అమ్మా! అమ్మా! ఏది? ఎవరూ లేరు. అమ్మా! అమ్మా! ఈ పాపితో నేమన్నావు? ఈ యంధున కేమి చూపించినావు? నిజముగా నేను కామాంధుడనే. కామము ప్రేమ అని భ్రమపడి కర్తవ్యజ్ఞానము పోగొట్టుకొన్నాను. శాస్త్రములు చదివి, ధర్మనిష్ఠుడనై ధర్మపత్నిని విడిచినాను. తల్లిని తిరస్కరించినాను, స్వధర్మమును త్యజించినాను...ఇప్పు డేది గతి? సాధనమేమి? పోదునా? మా తల్లిదగ్గరకి వెళ్లుతాను. చేతులు జోడించి క్షమించుమని ప్రార్థిస్తాను. సాధ్వియైన నా భార్యసరస చేరుతాను. క్షమించుమని ఆమెను వేడుకొంటాను...కాదు, కాదు. ఏ మొగముతో ఇంటికేగగలను? నా పాపిమొగము వాళ్లకెట్లు చూపగలను? మొండికట్టైనై ఇక జీవించిన ఫలమేమి? (మంచముపై బడి మొగము దాచుకొనును.)

(అబ్దుల్లా బాకుతో వచ్చును)

అబ్దు—ఇక నాలస్యము చేయరాదు...దూలియా! చూడు చూడు! నేను తెలివితక్కువవాడ నని కదా నీ అభి

ప్రాయము. నేను పిరికివాడనని కదా నీ ఊహా! నాబుద్ధి నాధైర్యము ఇప్పటికైనా తెలిసినవా? (శా కెత్తును)

నీలా—(లేచి కూర్చుండి) తే, తే, అబ్దుల్, నన్ని పాపజీవితమునుండి ఉద్ధరించు, రా, రా.

(దూలియా వచ్చును)

దూలి—ప్రభూ! ప్రభూ! ఎవరది? (అబ్దుల్లా చేయి పట్టుకొనును)

# నీలాచలము

## రెండో అంకము

### మొదటి దృశ్యము

కుటీరము.

(నీలాచలముతల్లి రోగపీడితయై మంచముమీద పరుండును—
తిలోత్తమ ఆమెకు సేవచేస్తూండును)

తిలో—అత్తా! అత్తా ఊరడిల్లండి.

వృద్ధ—విను, విను. జాగ్రత్తగా విను. వాడు చాలా చెడ్డాడు. పండితుడని అందరూ వానిని గౌరవించేవారు. నిష్ఠాపరుడని అందరూ పూజించేవారు. వానికి వివాహము చేసి కోడలి నింటికి తెచ్చినాను. నవాబుదర్బారుకు పోయి నీవిద్య కనపర్చితివా సంపద కల్గునని చెప్పినాను. ఏదుర్ముహూర్తమున వెళ్ళినాడో అక్కడొక స్త్రీని చూచి మోహించి దాని వలలో పడి తిరిగి రాలేదు. నీనాథుడటుతర్వాత తిరిగి రాలేదు. (ఏడ్చును)

(నీలాచలము వచ్చును)

నీలా.—ఏలాగు రాగలడు? అందుచేతనే రాలేదు. అతడు తురకలలో కలసినాడు.

తిలో—ఎవరు వారు! ఎవరిమూర్తి ఇది? ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా.

నీలా—(ముందుకు పోయి) ఆగు పిశాచీ! ఇంకా ప్రాణేశ్వరా అంటున్నావా? ప్రాణేశ్వరుడు! హాహ్హాహ్హా! లాభములేదు, ఫలము శూన్యము.

తిలో—ప్రాణేశ్వరా!

నీలా—తిరిగి వచ్చినాను. కౌగిలి యిస్తావా? నీ భుజములచేత నన్ను కట్టు—ఇప్పుడు కళాచంద్రుడు బలహీనుడు కాడు. కొట్టుతావా? నీ కుటిల కటాక్షములు బరపి నా హృదయము చీల్చుము. ఇప్పుడు కళాచంద్రుడు కోమల హృదయుడు కాడు.

తిలో—ప్రాణేశ్వరా! నేను తిలోత్తమను.

నీలా—తిలోత్తమా, ప్రాణేశ్వరీ! రా, రా; వద్దు వద్దు; నన్నంటకు—నేను జాతి పోగొట్టుకొన్నాను, ధర్మము త్యజించినాను; మత్స్యమాంసములు తిన్నాను, అనాచారములు సల్పినాను. నన్ను ముట్టుకోవద్దు—నేను పాపిని.

తిలో—ప్రాణేశ్వరా! (ముట్టుకొనడానికి ముందడుగు వేసి అత్తగారిని చూసి) అత్తా! అత్తా! చూడండి! ఇదుగో మీ తనయులు మిమ్ము చూడడానికి వచ్చినారు.

వృద్ధ—నా మాట విను. వాడు ధర్మము త్యజించెను, ముసల్మానులలో కలిసి గోమాంసము తిని ఇహాపరములు చెడగొట్టుకొన్నాడు.

నీలా—నిజమే. అంతా చెడగొట్టుకొన్నాడు. గోమాంస మారగించి అంతా పాడుచేసుకొన్నాడు. ఎవరు తినిపించినారు ? (పైకి చూచి) అదిగో ! అదిగో ! ఆ రాకుసి నవ్వుతూన్నది. తినగూడనిది తినిపించినానని నవ్వుతూన్నది. నాజాతి చెడగొట్టిందని చప్పటులు చరుస్తూ గెంతుతూన్నది. అదిగో ! నావైపు పరుగెత్తి వస్తూన్నది. పెడమొగముచేసి పరుగెత్తుతూన్నది. నన్ను మింగుతాను, తింటాను అని బెదిరిస్తూన్నది. అమ్మా ! అమ్మా ! నన్ను పట్టుకో ! నన్ను దాచమ్మా ! నాపక్కకు దగ్గరగా రా ! నన్ను గట్టిగా కౌగిలించుకో—ముట్టుకొందునా ?

తిలో—(తనలో) ఆహా! సంఘమా ! నీ కట్టుబాట్లింత కఠినములా ? నీ అడ్డంకి వల్లతల్లి పిల్ల నంటకూడదా ? భార్యాభర్త లొకరి నొక రంటగూడదా ?

నీలా—అమ్మా ! ఆ రాకుసి తిరిగీ పరుగెత్తి వస్తూన్నది. నన్ను గట్టిగా కౌగిలించుకో అమ్మా ! నీ పుత్రుని విడిచిపెట్టకమ్మా ! కళాచంద్రుని కావవా ?

వృద్ధ—ఏ మన్నావు ? నే నేమి విన్నాను ? ఇంకోసారి అను. నీవు కళాచంద్రుడవా ? నా కొంగుబంగార మవా? నాకళ్ల కమృతవర్తివా? నా కూతకర్రవా ? కావు కావు—

నీవు మోసకాడవు—అసత్యవాదివి. కళాచంద్రుడు చాలా కాలముకిందటనే గతించెను. కళాచంద్రు డీలోకమున లేడు. ఆహా! కళాచంద్రా! ఈ ముసలిదానికి ప్రాపు నీవె—దాపు నీవె—ఈ దీన కాధారము నీవే. ఎటు బోతివిరా తండ్రీ! న న్నొంటిగా విడిచి ఎక్కడు న్నావు? రా, నాయనా, రా!

నీలా—గతించెను, కళాచంద్రుడు గతించినాడు. తన భార్యయెడ అత్యాచార మొనర్చి అంతరించినాడు. తల్లి యెడ ద్రోహ మొనర్చి తరలినాడు. ఒక క్షణమేనా అతని నాపలేకపోతివి. బుద్ధిచెప్పి పుట్టినింట నిలుపలేకపోయినారు. నిన్ను మోసగించి పోయి మరణించినాడు!

తిలో—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఏమి దారుణ దృశ్యము! అత్త మతి చలించింది. భర్త మతిపోయింది, ప్రపంచ మంతా ఉన్మాదావస్థలో నున్నది. ఉన్మాదాఖిలమైన ఈ జీవితమువల్ల ప్రయోజన మేమి? పిడుగా! నీ కున్మాదము లేదా? సాగరమా! నిన్నున్మాద మావహించలేదా? త్వరగా పొంగవేమి? ఉన్మాదమయమైన నా జీవముల నూడ్చివేయరాదా? (మూర్ఛ)

నీలా—(తిలోత్తమను చూసి) ఎవతెవు నీవు? అమ్మా! ఆ రాక్షసి వస్తూన్నది! ఆ రాక్షసే! నాకు చాలా భయ మవుతూన్నది. నన్ను కౌగిలించవా? నన్ను చేరదీయ వేమి?

వృద్ధ—కౌగిలించనా నిన్ను? ఇదిగో కౌగిలిస్తాను.

నాయనా! ఇక భయము లేదు. తండ్రీ!...ఆఁ, ఆఁ! నీ వెవ్వడవు? కళాచంద్రుడవా? కావు—కావు. నీవు కళాచంద్రుడవు కావు—నీవు తురకవు—నీవు కళాపాహాడువు. (పక్కమీద కూర్చుండును)

నీలా—కళాపాహాడ్! నీలాచలము! అతడు ఈ ప్రపంచమున లేడు— ఆ విషయము మీకు తెలియజేయడమునకే నేను వచ్చినాను...అమ్మా! అమ్మా! నేను కళాచంద్రుడను—కళాపాహాడ్ కాను. నేను హిందువును— మహమ్మదీయుడను కాను.

వృద్ధ—ముసల్‌మానువి కావా? హిందువువా? హిందు వవుతావా? కాగలవా? ఇది సాధ్యమా?

నీలా—హిందువును కాలేనా? హిందువు నవుతాను. అమ్మా! అమ్మా! హిందువు నవుతాను—కాలేనా అమ్మా?

వృద్ధ—కా లేకేమి నాయనా? కన్నీ రోడ్చు! అశ్రుప్రవాహము పారనీ! దానిచేత నీవుచేసిన పాపము కొట్టుకొని పోతుంది—ని న్నంటిన మాలిన్యము తుడుచుకొని పోతుంది. పతితపావనుడు—కళంకభంజనుడు—నీలాచలవిహారి—జగన్నాథునివద్దకు పోయి అతని శ్రీచరణకమలము లంటి, అతని పవిత్రనామము జపించి, నీ దేహము, నీ ప్రాణము, నీ సర్వస్వము నాతనికి ధారపోసితివా అతడు నీపై కరుణించి వరము ప్రసాదించును—అప్పుడు నీవు నీ పాపపంకమునుండి ఉద్ధరింపబడుదువు. ఇదే నీకు తరణోపాయము.

నీలా—నిజముగా వరము లభించునా ? నిశ్చయముగా ఉద్ధరించబడుదునా ? బలే! బలే! ఇదిగో కన్నీరు ప్రవహింప చేస్తాను – మిన్ను మన్ను ఏకము చేస్తాను. జగన్నాథము పోతాను ; ఇప్పుడే బయలుదేరుతాను. జగన్నాథుని చరణ కమలములు ధ్యానించి ప్రాణాయామ మొనర్చి "మా అమ్మ పంపింది, నాకు వరము ప్రసాదించు, నాపాపములు పరిహరించు. నన్ను హిందువుని చేయుము" అని ప్రార్థిస్తాను. అమ్మా! తరువాత ఇక్కడికి వస్తే నన్ను కౌగిలింతువా ?

వృద్ధ—ఎందుకు కౌగిలించను? నా కొడుకును నేను కౌగిలించనా ? అంతకన్న నా కానందదాయకమైన పని ఏ ముంది? ఇహమున నా కదే మహాభాగ్యము. నాయనా ! నాయనా ! ఎక్కడున్నావు ? నీ ముసలితల్లిని, నీ భార్యనూ విడిచి ఎక్కడి కేగినావు ? తండ్రీ ! ఒక్కమారు నాకంట పడి నన్ను ధన్యను చేయుము. ఒక్కమాటాడి నా వీనులకు విందొనర్చుము—ఒక్కసారి నా శరీరము నంటి నాప్రాణము చల్లజేయుము—నా కోర్కె ఎట్లు తీరుతుంది ? నా తండ్రి ఎలాగు రాగలడు ? తండ్రీ, నీ వెక్కడున్నావు ? జీవించి యున్నావా ? పెద్దదానిని నేనే జీవించి ఉన్నాను, నాతండ్రి జీవించడ మబ్బురమా ?—ఏమో ? జీవించి లేడేమో ? తిలోత్తమా ! తిలోత్తమా ! క—ళా—చం—ద్రా—(మృత్యువు)

తిలో—అత్తా! అత్తా! ఏ మిది ? వికృతరూపు వచ్చింది! కళ్లు మూతబడ వేమి ?—ప్రాణేశ్వరా! రండి! చూడండి.

నీలా—అమ్మా! అమ్మా! నిద్రించు! నిశ్చింతురాలవై నిద్రపో—నే నిప్పుడే బయలుదేరుతాను. జగన్నాధప్రభువు వద్ద వరము పుచ్చుకొని హిందువు నౌతాను. అప్పుడు నన్ను కౌగిలించుకొంటావు—ఆహా! అమ్మ నన్నాలింగనము చేసుకొన్నప్పుడు నాకు సంతసము చేకూరును. (త్వరగా పోవును)

తిలో—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఎటు పోతూన్నారు? ఈ దుఃఖినిని ఒంటిగా విడిచి ఎటు వెళ్లుతూన్నారు? (మూర్ఛ)

(దూలియా ఫిరోజాలు వత్తురు)

దూలి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఎక్కడ నున్నావు? ఫిరోజా! నా నాధుని చూపించు—ఇదే వారి కుటీరము. హా! ప్రాణకాంతా! (పడిపోవును)

ఫిరో—సఖి! సఖి! ఊరడిల్లు.

తిలో—ఎవర్తె పిచ్చిది?

ఫిరో—సతీరత్నమా! నీ పేరు తిలోత్తమా?

తిలో—ఈ హతభాగ్యురాలి పే రదే.

దూలి—(లేచి) తిలోత్తమా! అక్కా! వా రేరీ? ఎక్కడికి వెళ్లినారు? నా కొకసారి చూపవా? త్వరగా చూపించు.

తిలో—(తనలో) ఆ భాగ్యవతి ఈమె కాబోలు? ఈమె ముసల్‌మాన్ స్త్రీయా? పతివియోగమున పిచ్చిదైనదే—

దూలి—అక్కా! అక్కా! మా టోడవేమి? ప్రాణనాథుని నీవద్దనుండి బలాత్కారముగా కొనిపోవుదు నను కొంటున్నావా? లేదులేదు— ఒక్కసారి వారిని దర్శించవలెనని వచ్చినాను. వారి చరణకమలముల నర్చింపవచ్చినాను. ఒక్కసారి చూపించు. ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! రండి! రండి! ప్రభూ! ఈ దీన ఈ అకించనపై అనుగ్రహించరాదా? మీరు లేకున్న నాకీలోక మంతా అంధకారమై కనబడుతూన్నది. ఏది చూసినా మనస్సు కలవరపడుతూన్నది.

తిలో—చెల్లెలా! నీవు నాకు సోదరివి. నీవు తురకదానవు కావు. హిందూకాంతవు, పరమసాధ్వివి—ఉత్తమపతివ్రతవు. అయ్యో సంఘమా! నీకట్టుబాట్లు లేకుంటే ఎంతో మేలగును! ఆహా! ధర్మమా! నీభీతి లేకుంటే జాతిభేద మంతరించి యుండునుకదా? ఈశ్వరుడూ అల్లా అను పదార్థములు వేరనుమాట మరచి ఈ సతీశిరోమణిని కౌగిలించియుందును కదా? అప్పుడు నాజన్మ సార్థకమౌను. నేను ధన్యనౌదును.

దూలి—అక్కా హతభాగ్యను! నా కంత అదృష్టమా? దేవీతుల్యవగు నీవంటి సోదరి సుఖస్పర్శభాగ్యము నాకబ్బునా?—ప్రాణేశ్వరు డెక్కడ నున్నాడు? ఇంటిలో నుంటే ఒకసారి పిలువవా? ఆహా! అక్కా, నాకంటికిది భూలోకము లాగు కనబడలేదు, స్వర్గమం దున్నట్లుంది.

తిలో—అత్తగారు వైకుంఠము కేగినారు, ప్రాణనాథుడు నీలాచలనివాసు దర్శింప నేగినాడు.

దూలి—అత్తగారు మరణించినారా? అయ్యో! ఆమెను చూచే భాగ్యము నాకు లభించదాయె—అత్తా! నిష్ఠురాలనై మి మ్మెంత క్షోభపెట్టినాను! మీరు జీవించియుంటే మిమ్మారాధించి క్షమించండి అని వేడుకొనియుందును. మీరు నాతప్పు సైరించినారన్న మాట విని ధన్య నౌదునే, అబ్బా! నా దారుణకృత్యము నా హృదయమర్మములను భేదించి నాకు యాతన కలిగిస్తూన్నది. నీలాచలనివాసు డా జగన్నాథుడూ, వైకుంఠవాసిని యైన జగన్మాతా వీరే ఇప్పుడు నా పాపము పరిహరించగలరు—ప్రాణనాథుడు నీలాచలమున కేగెను, అత్తగారు పరమపదము చేరినారు. ఈ లోకమున మా కుటుంబమున కెల్ల మిగిలినది అబలలము, అశక్తుల మైన మే మిద్దరమే. ఫిరోజా! నీ వింటికి పో! నే నిక్కడ ఒక క్షణ ముండను. నాపతికడ కేగెదను. ఆయన కంట పడితే జీవించియుంటాను, లేదా మా అత్తగారి నర్చించడానికి దివికి పోతాను. ఇదే సెలవు. (పోవును)

ఫిరో—సఖీ! సఖీ! (వెంట పోవును)

తిలో—చెల్లెలా! ఏమి నీ పాతివ్రత్యము! ఏమి నీపతి ప్రేమ! నడువు నడువు. త్వరగా ప్రాణనాథుని చెంత జేరుకో! అత్తా! మీ తనయుని కోరిక ఈడేరున ట్లాశీర్వదించండి! నేను కూడా మీవద్దకు శీఘ్రమే వస్తూన్నాను.

---

## రెండో దృశ్యము

(యుద్ధక్షేత్రమున శిబిరము)

సులేమాన్—దూత.

సులే—పత్తా తెలియనే లేదా ?

దూత—మహాప్రభూ! కొంచెమైనా దొరకలేదు.

సులే—ఇంకోసారి యత్నము చేయండి—దూలియూ కనబడలేదు—నీలాచలమూ కనబడలేదా—ఏమి చిత్రము!

(తెరలో) ముకుంద దేవుగారికి జయము !

సులే—ఏమిటీ జయధ్వని ?

(రెండో దూత వచ్చును)

దూత—మహాప్రభూ! ముకుంద దేవు మీశిబిరము చుట్టవేసినాడు.

సులే—సేనాధిపతి లేడా ? మన సైన్య మేమయినది ?

దూత—ఎవరూ లేరు. ఒకరూ కనబడరు. శత్రు సైన్యము సమీపిస్తూన్నది.

(తెరలో) ముకుంద దేవుగారికి జయము.

అవిగో వారి జయోల్లాసధ్వనులు.

(తెరలో) జగన్నాథస్వామికి జే! ముకుంద దేవుగారికి జే!

సులే—ఏమి చెప్పమా ! రహమతాలీ లేడు. మన సైన్యముతో గిరిసంకటమున శత్రువులపై పడవలెనని కని పెట్టుకొని ఉంటా నన్నాడు. అక్కడ లేడా ? అందరూ పారి

పోయినారా? లేక వీళ్లంతా కుట్ర చేసినారా? నా మూల బలముకూడా కనబడదే? దూతా! నీవుపోయి వాళ్లని పిల్చుకొని రా. నాకొక కత్తితే—(దూత పోగా సులేమాన్ పచారు చేయును)

దూత—సర్వనాశ మయింది! ఎవరూ లేరు ఒక కత్తి ఐనా లేదు.

సులే—ఎవరూ లేరా? కత్తికూడా లేదా? ఎంతకుట్ర జరిగింది! నీలాచలమూ! నీలాచలమూ! ఎంత తెలివిమాలిన పని చేసినాను! రహమతాలీని నమ్మడము తెలివితక్కువ పని. నా జీవితాంతసమయమున నిన్నొకసారి చూడగలనో లేదో—అబ్దుల్లా!

(ఉత్కళసైనికుడు వచ్చును.)

సైని—ఇదిగో—ఇదిగో నవాబు! పట్టుకొందాము.

సులే—కత్తి! కత్తి!

సైని—కొట్టు! కొట్టు! మంచితరుణము వచ్చింది.

(చంపడానికి సిద్ధపడుతూండగా ముకుంద దేవు వచ్చును)

ముకు—ఆగండి! నిరస్త్రుడైన శత్రువుపై కత్తి దూయరాదు. అదిగాక అతనికి సాయము లేదు—మీరు క్షత్రియులు కారా? అధర్మయుద్ధము కూడునా?—నవాబ్ సాహెబుగారూ! మా సైనికుల తప్పు సైరించండి—ఇదిగో కత్తి (ఇచ్చును) యుద్ధసన్నద్ధులు కావచ్చును.

సులే—మహానుభావా! వీరాగ్రేసరా! మీ రెవరు? మీ రేనా ముకుంద దేవుగారు? మీయందు దేశ మహాత్వ మున్నది!

ముకు—ఇందు దేశ మహాత్వ ముంది. ఇది క్షత్రియులకు సర్వసామాన్యధర్మము.

సులే—నే నొంటివాడనే?

ముకు—మీ కేమీ భయము లేదు—నే నొక్కడనే మీతో యుద్ధము చేస్తాను. మనము యుద్ధము చేస్తూన్నప్పుడు మా సైనికు లొక్కఅడుగైనా ముందుకి రారు.

సులే—మీరు మహోదారులు.

ముకు—నవాబుగారూ! మీరు నన్ను వృథాగా పొగడుతూన్నారు. మీరు వీరులు గనుక మీ కుచితమైన పని చేయండి. వృథాకాలయాపన మెందుకు?

సులే—నిజము. యుద్ధమునకు సిద్ధుడను.

ముకు—అత్యుత్తమము! (యుద్ధము జరిగి సులేమాన్ పడును)

సైని—ముకుంద దేవుగారికి జయము! అక్బరు పాదుషావారికి జయము!

ముకు—నవాబుగారిని చెఱగొని నా శిబిరమునకు కొని రండి. (తనలో) ఏమి విశ్వాసఘాత! కతలురహామత్ లెంత కుట్ర పన్నినారు? అదృష్టవశమున నాకు జయము చేకూరెను కాని లేకుంటే సర్వనాశమై యుండును. వా

ళ్లిద్దరూ కలిసి నాతో పోరవలెనని దురాలోచన చేసి నట్లు కనబడుతూన్నది వారిచర్య! కానీ—నే నిక నాలసించ కూడదు; నా సైన్యము బహుస్వల్పము. అప్రమత్తుడనై యుండవలెను. (పోవును.)

సులే—న న్నంత మొందించకుండా వెళ్లిపోయినా రేమి చెప్పుమా? నా దూలిఖూజాడ తేలలేదు, నీలాచలము పత్తా తెలియలేదు. వాళ్లిద్దరితోనూ నా విజయలక్ష్మి లేచిపోయింది. నా కిక ఎక్కడి సుఖము? ఎక్కడి శాంతి? ఇక నేను బ్రతికి యుండడ మెందుకు? రహమత్! ఆహా! ఒక్కసారి నాకంట పడితివా!—ఒక్కసారి నాచేత చిక్కి తివా!—ఈ పిడికిలితో నీ తల వేయిచెక్కలగునట్లు బాది యుందును. నీ శరీరము ప్రతికీలు విరుగునట్లు నా కాళ్లతో దంచియుందును. ఇప్పు డెందు కీ వృథా జల్పనము? ఇక నెక్కడి ఆశ! అంతా ఈశ్వరవిలాసము. సైనికులారా! న న్నెక్కడికి తీసుకొని పోవలెనో అక్కడికి పదండి. (ఖైదిగా పోవును)

(రహమత్ కతలూ వత్తురు)

కత—ఆలీసాహెబా! నీ పక్కలో ముల్లు ఊడి పోయింది. ఇక నాపక్కలో బల్లెము పోయే సాధన మే మాలోచించినారు?

రహ—మంచి ఉపాయమే తట్టింది. ఒక క్షణము విరామిం దుంటే కొంపలు మునుగును. ఆ రహస్యలేఖ ముకుంద

దేవుచేతిలో పడకుంటే తిండికి లేక అతడు మాడిపోయి యుండును, నవాబుగారు మనకు ఖైది అయి యుండురు. అందుకు మారు ముకుంద దేవుచేతిలో చిక్కినాడు.

కత.—ఆ చీటీలో ఏమి వ్రాసినారు మీరు ?

రహ—మీరు లూటీ కొట్టిన రసదుబళ్లు నే నేలాగు దాచినానో—మన యిద్దరి సైన్యములూ కలియడానికి ఏర్పాటు లేమి చేసినామో—నవాబుగారి మనసులో అబద్ధపు నమ్మకము కలిగించి శిబిరములో నొంటిగా నుంచిన విషయము మొదలైన సంగతు లన్నీ అందున్నవి.

కత—ఆ చీటి ఎవరిచేత పంపినారు ?

రహ—మ రెవరు ? మన అబ్దుల్లాచేత—అందుచేతనే ఇంత ప్రమాదము సంభవించింది—ముకుంద దేవుని చూసి మీ రనుకొని ఆ చీటి అతని కిచ్చి వచ్చినాడు మూర్ఖుడు !

కత—గొప్ప ప్రమాదమే జరిగింది—సరే, కాని—గతముగురించి చింతించి ఏమి లాభము ? ఇప్పు డేమి సాధనము ?

రహ—రహస్యముగా హత్యచేయడమే యుక్తము.

కత—చేసే వా రెవరు ? (అబ్దుల్లా వచ్చును)

అబ్దు—ఇదిగో నే నున్నాను. దూలియా ఏదీ సేనాధిపా ? ఆ చీటి ఎవరూ చూడకుండా ఇచ్చివేస్తే దూలియా నిస్తా నన్నావే. ఏది? తే—తే. నా ప్రేయసి దూలియా నిచ్చి మాటలాడు.

కత—ఇతడా మీ రహస్యలేఖను తీసుకొని వెళ్ళిన వాడు ?

రహ—అవును. ఇతనిచేతనే హత్యచేయించవలెనని ఆలోచిస్తూన్నాను.

కత—ఈ కొరగామిచేతనా ? ముకుంద దేవుని చంపు మంటే మి మ్మంతమొం దిస్తా డేమో ?

రహ—ఇప్పు డా భయము లేదు. ఇప్పుడే చక్కగా గు ర్తించి వచ్చినాడు. యువరాజా ! చూడు—ఇంకొక్కపని చేయగల్గితే దూలియాను తప్పకుండా నీ కిస్తాను.

అబ్దు—నీమాట మరి వినను. నీవుచెప్పినపని చేయను. హా ప్రేయసీ ! దూలియా ! ఎక్క డున్నావు—నా కొక్క సారి దర్శన మియ్యవా ?

రహ—యువరాజా! ఈసారి ఈపెద్దమనిషి సాక్షి—నేను చెప్పిన ఇంకొక్కపని చే స్తే నీ కవశ్యము దూలియా నిచ్చి తీరుతాను.

అబ్దు—నిజముగా ఇస్తావా ?...ఏదీ ? ఆపని ఏమిటో చెప్పు. దూలియా ! నీ కోస మెట్టి పాటులు పడుతూన్నానో చూడు.

రహ—ఈ బాకు తీసుకొని నీ విప్పుడు చీటి ఇచ్చి నావే అతనిని రహస్యముగా చంపి రా !

అబ్దు—ఏమిటి ? ఏమిటి ? రహస్యహత్య ! నాడు చేసిన హత్య జ్ఞాపకము వస్తూంది. అప్పుడు దొరికిపోవలసి

నదే. కక్కగారికి తెలిస్తే కొంప మునిగేది. ఇంతవర కదృష్ట వంతుడనే!

రహ—అలాగైతే ఇక దూలియామాట తలపెట్టక నీదారిని బైటికి నడువవలసినదే.

అబ్దు—అమ్మయ్యో! దూలియాని మరువగలనా! ఏదీ కత్తి తే! కార్యము క్షణములో ముగించి వస్తాను. కాని—

రహ—దూలియా—

అబ్దు—కాదు కాదు. ఆ భయము లేదు. నిశ్చయముగా ఇస్తావుకదా?

రహ—తప్పకుండా—బహు జాగ్రత్తతో పని జరగవలెను సుమా! ఆరోజు లాగు పట్టుబడకూడదు.

అబ్దు—(బాకు తీసుకొని) మీకా భయము వద్దు. ఈపని నాకు క్రొత్తది కాదు. ఈ ఉంగరము చూపిస్తే నన్నెవరూ అటకాయించరు.

కత—వాహ్వా! ఎంత చక్కగా కుదిరింది పతకము.

అబ్దు—దూలియా నాకు లభిస్తుంది కదా?

రహ—ఎన్నిసార్లు చెప్పమన్నావు?

అబ్దు—ఇదిగో వెళ్ళుతూన్నాను. దూలియా! ప్రేయసీ! సేనాధిపా—ఒకమాట.

రహ—ఏమిటది?

అబ్దు—నన్ను పాదుషాను చేస్తానన్నావు—జ్ఞాపకముందా?

రహా—అబ్బబ్బ! ఎన్నిసార్లు చెప్పమన్నావు. నేను చెప్పినపని చేస్తివా నీ కేమి కావలెనంటే అది చేస్తాను.

అబ్దు—నేను పాదుషా నయితే దూలియా బేగ మవుతుంది. అవునా? దూలియా పాదుషా అయితే నేను బేగము నౌతాను..ఏమంటావు?

రహా—అలాగే.

అబ్దు—ఇదిగోపోతూన్నాను. దూలియా! దూలియా!

కత—మంచివాడినే చేరదీసినావు! పిచ్చి పెద్దమ్మ ఎలా గాడిస్తే అలా గాడుతూన్నాడు.

రహా—ఈపిచ్చియే నన్నింతవానినిచేసింది. చూస్తూ న్నావు కదా నా కెలాగు ఉపచరిస్తూన్నాడో?

కత—సరే కాని. ముకుంద దేవుని ముక్కున ఊపిరి ఉన్నంతకాలము వానిని నేను విడువను. అతను బ్రతుకుతే మనగుట్టు పాదుషాకి తెలుస్తుంది. అప్పుడు మనగతి ఏమి కాగలదో కొంచె మాలోచించు.

రహా—చింత మానుకో. ఈసారి మనకార్యము సాను కూలముగా చేసి వస్తాడు అబ్దుల్లా. నవాబుగారిగతి ఎంత పాడయిందో చూడండి.

కత—నిజమే. అతనికి గొప్పకష్టమే వచ్చింది. కాని సింహాసన మెక్కదలచినవాళ్లకీ చిక్కులు తప్పవు.

రహా—నవాబుగారు బ్రదికి ఉంటే మన పాటులకు మేర ఉండదు.

కళ—నా మనసులోమాట చెప్పుతూన్నావు. మిత్రమా! ఏదీ ఒక్కసారి కౌగలింతాము. ఇంతటినుంచి మన స్నేహము ద్విగుణించింది.

## మూడో దృశ్యము

వారవాటి దుర్గము—శిఖ మనాయీలు.

శిఖ—మణిభాయీ! అంధకారము సూచికాభేద్యమై యున్నది. ఇట్టి మేఘావృతమైన రాత్రి ఎప్పుడూ చూడలేదు.

మనా—మేఘాలు దొంతరదొంతరలుగా ఉన్నవి.

శిఖ—అబ్బా! గాఢాంధకారము! ఇంత రాత్రయినా యింకా రాలేదేమి?

మనా—రాత్రి ఎన్నిగడియలయిందో చెప్పజాలము, కాని గడియలు రాత్రికి మించదు.

శిఖ—ఐనా ఎంత చిమ్మచీకటి—నీరంధ్రము— మధ్యరాత్రి లాగుంది.

మనా—ఇదంతా ఈశ్వరవిలాసము. ఇట్టి సుయోగము దుర్లభము సుమా!

శిఖ—చెప్పేదేమి—ఇదంతా మన కార్యమున కనుకూలముగా నిర్మించబడినది.

మనా—శిఖభాయీ! నీవు సేనాధిపతి వైతే కళ్లు నెత్తిమీదికి రానియ్యకుమా!

శిఖ—నాతో చెప్పవలెనా? నిజము చెప్పుతూన్నాను. మనము చేసే దంతా మహారాజుగారి కోసము.

మనా—మరేమి? పైనుండి ఎవడినైనా తెచ్చి సేనాధిపత్య మిస్తే ఏచిక్కూ ఉండకపోను — మన ప్రతాపములో షోడశాంశమైనా లేదు—అటువంటి అభాజనునికి అధికార మిస్తే వాడు మనతలఎక్కి తాండవమూడడా? శరీరములో రక్తమాంసము లున్నవా రెవరైనా దీనిని సహిస్తారా?

శిఖ—ఇంత అనమానమా? మనకన్న ఎక్కువ తెలిసినవాడా? అనుభవ మెక్కువా? నో రున్నది, గనుక నాలుగు వాగుతాడు. ఇం తెందుకు? ఈ యుద్ధములో ఏమైనా పరాక్రమము చూపినాడా?

మన—అసలు పస లేదు. ముసలి సేనాధిపతి ప్రాణాలు విడిచిపెట్టినాడు—అదే తరుణముగా నెంచి తన సేనను పురిగొల్పి యుద్ధము జరుగుతూన్న చోటికి పరుగెత్తినారు. మన మంతా ఇల్లు చేరుకొన్నాము.

శిఖ—తిరిగి వచ్చినాము కనుకనే బ్రతికినాము—మనలాగు చాలామంది బ్రతికినారు—తక్కినవాళ్లు మళ్లుదా మనే సరికి ఒకరైనా బ్రతుక కల్గినారా? మన మెంత నలిగిపోయినాము—ఇందువల్ల రాజుగారి కేమి లాభము వచ్చిందో నీకు తెలుసును కదా? రాజుగారి కది తెలియదు, మనము పిరికివార మట—వారు సాహసులు వీరులట—ఏమంటే సేనాధిపతులు!

మనా—సాహసులము కావుననే ఇప్పు డిక్కడికి రాగల్గినాము.

శిఖ—మాట లెన్నైనా అనవచ్చును.

మనా—ఊర కుండు—ఎదో చప్పుడు వినబడుతూ న్నది—వాళ్లు వచ్చిన ట్లుంది. కొంచెము ముందుకి పోయి నిల బడుతాము పద.

శిఖ—ఎందుకు ఒక్క దెబ్బతో సంపూర్తి చేస్తే తేలిపోతుంది—

(దూలియా వచ్చును)

దూలి—అబ్బా! ఎంత చీకటి!

శిఖ—(బాకుతో పొడిచి రివ్వున మనాయితో కూడా పోవును)

దూలి—అబ్బా! ప్రాణము పోతూంది—ఫిరోజా! ప్రాణము పోతూంది. హా! ప్రాణేశ్వరా! (ఫిరోజా పద్మా ననుడూ వత్తురు)

ఫిరో—అయ్యో! నీ వెవడవు? నీపేరు చాలా బాగుంది—నీవు దూలియా నెట్లు పోల్చినావు?

పద్మా—నా ఊరు బంగాళా దేశములోనిది. మా నవాబుగారి కూతురిని నే నెరుగనా?

ఫిరో—మే మింకా కొద్దిరోజు లిచ్చట ఉంటే ఈమె ఒళ్లు బాగుపడి యుండును. ఆమె ఉద్దేశము వేరయింది. కొంచెము నడువడానికి శక్తి రాగానే అంధకారబంధురమైన

రాత్రి పాటిచేయక బయలుదేరింది— "ఇట్టి ఘోరరాత్రి ఆడవారము తెగించి బయట ప్రయాణముచేయ సాహసించ డము తగదమ్మా" అని నే నెంత చెప్పినా వినలేదు. తెల్లవా రనీ బయలుదేగుదా మంటే విన్నదా? ఇప్పుడో వెంట ఉన్న నన్ను విడిచి ఈ చీకటిలో ఇంత ముందుకి వచ్చింది నీవే చూచినావు కదా? ... దీని కేమి? నీవు మాతో కూడా వస్తావా? వస్తే బాగుండును. మా కెంతో ఉపకారము చేసిన వాడ వవుతావు.

పద్మా—నేనూ జగన్నాథస్వామి దర్శనము కే పోతూ న్నాను. కాని ఇవి చీకటిరాత్రుళ్లు—ఈ ప్రదేశ మంతా దొంగలతోను తెరవాటుకాళ్లతోను నిండిఉన్నదని వదంతి.

ఫిరో—అందుకే తోడుకోసము పాకులాడుతూన్నాను.

పద్మా—నాకు నిజముగా ఎంతో వింతగా నుంది— మీరు నవాబుగారి బంధువులు—స్వజనము, స్త్రీలు—మీలాంటి వాళ్లు ఇటువంటి చీకటిరాత్రిళ్లలో ఎలాగు ప్రయాణ మయినారు?

ఫిరో—(తనలో) ఇదంతా ప్రేమ మహత్వము—నీ కా మర్మ మేలాగు తెలుస్తుంది? (పైకి) ఇదో గొప్ప గాథ.

పద్మా—సరే—అది నా కెందుకు?—మీరు మా నవా బుగారి కుటుంబములోనివాళ్లు నన్ను రమ్మని నిర్బంధిస్తు న్నారు కనుక తప్పకుండా మీతో ఉంటాను. భగవద్విలాస మేలా గుంటే ఆలాగు కానీ!

ఫిరో—రా! సోదరా! త్వరగా రా! నా సఖి పిచ్చి దానిలాగు ఎటో పారిపోతూన్నది.

దూలి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!

పద్మా—ఎవ రా మాట లాడుతూన్నది?

ఫిరో—అది నాసఖి కంఠధ్వనిలా గుంది.

దూలి—కొంచెము నీళ్లు! ఫిరోజా! నీళ్లు.

ఫిరో—ఏమమ్మా! ఆలా గంటున్నావు? (కౌగిలించి) ఇ దేమి? నీ శరీరమునుండి రక్తము ప్రవహిస్తూన్న దేమి?

పద్మా—రక్తమా! వెలుగుంటే బాగుండును.

(సేనాపతి దీపముతో వచ్చును)

సేనా—ఎవరు వెలుగు కావలె నన్నది? బాటసారులా?

పద్మా—ఫిరోజా, ఎక్కడ రక్తప్రవాహ మన్నావు?

ఫిరో—ఇదిగో ఈమె చేతినుండి పడుతూన్నది.

పద్మా—శ్రీజగన్నాథస్వామి కృపవల్ల ఇప్పటికి ధన్యులమే—భయము లేదు—ఈగుడ్డ గాయమునకు చుట్టండి (పాగా చించి యిచ్చును)

దూలి—అబ్బా! దాహము! కొంచెము మంచినీళ్లివ్వండి—

సేనాపతి—నేను నీరు తెస్తాను. (తనలో) ఎవ రీపని చేసినాగు? అదీ కోట ముందర?

(ద్వారము తెరచుకొని సేనాధిపతి పోవును)

ఫిరో—సఖి! సఖి! మా టాడ వేమి! అయ్యో! పద్మాననా! నాసఖి జీవిస్తుందా?

పద్మా—ఏమీ భయములేదు—దైవకృపవల్ల దెబ్బ గట్టిగా తగులలేదు.

దూలి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఏమి దప్పి! కొంచెము నీరు!

పద్మా—ఈమె మనుష్యస్త్రీ యేనా? లేక దేవియా? ఏమి ప్రేమ!

(రాణీన్నీ సేనాపతీన్నీ వత్తురు)

సేనా—మహారాణీ—ఇంత ప్రయాసపడి మీ రెందుకు వస్తారు?

రాణి—ఏమి సేనాధిపా! ఇందువల్ల ఏమి పోయింది! ఆడవాళ్లపై అస్త్రాఘాతమా? అదీ కోట దగ్గిరనా? ఇ దేమి విడ్డూర్యము! రాజుగారి కీ విషయము తెలియవలసినదా? కాదా? మహారాజుగారు లేనప్పుడు నే నీ విషయము పరీక్షించవలెనా లేదా? ఏదీ ఆ బాలిక?

దూలి—అబ్బా! ప్రాణము పోతూన్నది—దప్పి! దప్పి!

రాణి—(దగ్గరకు పోయి) ఇదిగో మంచినీరు. (తాగించును) సేనాపతీ! నీవు పోయి పల్లకీవాళ్ల నిటు పంపు. వీళ్లని పట్టణములోనికి తీసుకొనిపోయి తగిన చికిత్స చేయవలెను.

(సేనాపతి వెళ్లును)

దూలి—అమ్మా! మీరు హిందువులా?

రాణి—ఎందు కమ్మా! ఏ దైనా—

దూలి—నేను తురకదానను.

రాణి—జాతిభేదమున కిదియా వేళ?

దూలి—నేను మీ శత్రుదేశ మండలిదానను.

రాణి—ఐతే నేమి? ఆపదలో నున్నవారి నుద్ధరించ డమే క్షత్రియులకు విధి—నిరాశ్రయుల కాశ్రయ మివ్వడమే క్షాత్రధర్మము. ఇందు స్వజాతి విజాతి అని కానీ, ధర్మము అధర్మ మనికాని, శత్రువు మిత్రు డని కాని ఎంచవలసిన అవసరము లేదు.

దూలి—ఈ క్షత్రియహృదయ మెంత మహాత్తుకలది! నాకు కొంచెము శక్తి వచ్చినది. కృతజ్ఞతాపూర్వకములైన నా వందనములు గ్రహించండమ్మా! ఫిరోజా, సీవ్రూ నమస్క రించవే—పద—ఇక నాలస్య మెందుకు? ప్రాణేశ్వరా! మీ దర్శన మెప్పుడు లభించగలదో?

(వెళ్ళడానికి సిద్ధపడును.)

రాణి—ఇదేమి? ఇంత రాత్రి వేళ మీ రెక్కడికి వెళ్లు తారు? మీభర్తగారు మి మ్మొంటిగా విడిచి ఎక్కడి కేగినారు?

ఫిరో—అమ్మా! అదొక పెద్ద గాథ.

రాణి—ఏమాట కానీ—ఇట్టి సమయాన మిమ్ము నేను విడువజాలను. మీ ఆకారము ఇంగితమూ పట్టి చూస్తే మీరు గొప్పవంశమువారని సులభముగా తెలుస్తూన్నది.

మీ కేదో దుర్ఘటన సంభవించినట్లుంది. మీ కేదైనా అను కూలమైన ఏర్పాటు చేయకుండా మిమ్ము విడువను. నాదుర్గము దగ్గర విదేశీయులయెడ ఇట్టి నృశంసాచరణమును మూల ముట్టుగా విమర్శించి, దానికి తగిన ప్రతివిధానము చేయ కుండా విపద్గ్రస్తుల నెట్లు విడిచిపెట్టగలను? ఇలాగు చేస్తే ప్రజ లేమనుకొంటారు? సాటిరాజు లే మంటారు? నా మన స్సాక్షి ఏ మంటుంది? శ్రీజగన్నాథస్వామిరాజ్యము పాప రాజ్యము కాకూడునా? ముకుంద దేవుని పరిపాలన అరాచ కము కాజెల్లునా?

దూలి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఇదిగో నేను పోతూ న్నాను. ఫిరోజా! నీవుకూడా రా! ఇంక నే నాగలేను.

పద్మా—దూలియా! దూలియా! నీవు దివ్యవనితవు కాని మనుష్యస్త్రీవి కావు. మాబోట్లు నీపాదధూళి శిరమున దాల్చవలెను.

రాణి—ఈమె నావలెనే విరహిణి. హాతవిధీ! సంయో గము వెంటనే వియోగ మెందుకు కల్పించినావు? సుఖము వెంబడిని దుఃఖ మెందుకు ఘటిస్తావు?

ఫిరో—అమ్మగారూ! మీ నిర్వ్యాజకటాక్షఋణము మేము తీర్చలేము—ఇక మాకు సెల వివ్వండి.

రాణి—నే నెప్పటికీ ఆలాగు చేయలేను. చేతులు జోడించి మిమ్ము వేడుకొంటాను. నేను మీరు నా ఆతిథ్యము పుచ్చుకో వేడుతూన్నాను. ఇదుగో నా దాసీలు వచ్చినారు.

(దాసీలు సేనాపతిన్ని వత్తురు)

దూలి—నా ప్రాణదాత్రి నన్నింతగా నిరోధిస్తూన్న ప్పుడు వారిమాట త్రోసివేయడము నా కసాధ్యము.

రాణి—సేనాధిపా! ఈ బాలకునికి తగిన సత్కారము చేయడము నీపని.

దూలి—అమ్మగారూ! రేపు వేకువను మాకు సెల విప్పించవలెను.

రాణి—రేపటి మాట కదా! నేడు నా ఆతిథ్యము స్వీకరిస్తారు కదా?

దూలి—ఎంత మహానుభావురాల వమ్మా!

రాణి—మీరు నన్ను పొగడ నవసరము లేదు. ఇది మాకు సత్యనైమిత్తిక కర్మ—సఖులారా! వీరి నతి జాగరూక తతో నగరులో ప్రవేశపెట్టండి.

(దూలియాను పట్టుకొందురు)

దూలి—అంతవసరము లేదు. నాకొరకు మీరు ప్రయాసపడవద్దు. నేను నడవగలను.

---

## నాల్గో దృశ్యము

### శిబిరము.

### ముకుంద దేవు—సులేమాన్.

ముకు—నవాబ్ సాహెబ్ ! రహమత్ ఉత్తరమువల్ల నా కంతా తెలిసింది. ఇదొక భీషణమైన కుట్ర. నిమ్మేలాగైనా శత్రువున కప్పగించి మీ రాజ్య మన్యాక్రాంతము చేయవలెనని వాళ్ల రహస్యోద్దేశ్యము. నన్నుకూడా వారు ఉపేక్షించలేదు. నాకు కాబోవు సన్మానము నాజీవము కూడా అపహరించవలెనని నిశ్చయించినారు. ఈవిషయము మీరామూలాగ్రముగా విన్నారు కదా ?

సులే—ఇప్పుడు చేయవలసిన దేమి ?

ముకు—మీరావిషయమై మీకు చింత వద్దు. నా కంఠములో ఊపి రున్నంతవరకూ మీకు నిస్సందేహముగా రాజ్యము ప్రాప్తిస్తుంది. ఇప్పుడు మీతో కావించవలసిన సంధిమరతులను ఆజ్ఞాపించే నిమిత్తము పాదుషావారి కుత్తరము వ్రాస్తూ అందు కతలుఖాన్ ఆచరించిన విశ్వాసఘాత సూచించినాను. వారిజాబు అందేవరకూ మన మిక్కడ ఉండవలసి ఉంటుంది.

సులే—మీ రిప్పుడు బహుజాగ్రత్తతో మెలగవలసి ఉన్నది. ఎందుచేతనంటే మొగలు పఠాను సైన్యములు ప్రస్తుతము ఒక్కచోట నున్నవి, మీ సైన్య మత్యల్పము.

ముకు—నవాబుగారూ! సైన్యము పెద్దదైనంతమాత్రమున ప్రయోజనము లేదు. వారు ధర్మయుద్ధము చేయగడంగితే మా సైన్య మల్పమైనా వారి సైన్యములకు తీసిపోదు—కతలుఖాన్ యుద్ధకళానైపుణ్యము నే నెరుగనిది కాదు. రహమత్ రణకౌశలము మీవల్ల తెలుసుకొన్నాను. అది కూడా నాకు భీతి కలిగించదు, అ దొక్క లెక్కలోది కాదు. మీరు కొంచెము సేపు విశ్రమించండి, రాత్రి చాలా మీరినది.

సులే—మీరు మాత్రము నిద్రపోరా?

ముకు—నా గురించి మీకు చింతవద్దు. (వెళ్లబోవును)

సులే—దీప మార్పవచ్చునా ?

ముకు—మీ కిబ్బంది లేకుంటే ఆర్పవచ్చును. ఉంటే కొంత ప్రయోజనకారి అని నాఊహ.

సులే—సరే—సలామ్ మహారాజా!

ముకు—సలామ్ నవాబుగారూ! (ముకుంద దేవు వెళ్ళును)

సులే—మానవుని భాగ్యపరివర్తన మిలాగే ఉండును. ఒకప్పుడు రాజసింహాసనమున సకలసుఖము లనుభవించడము, ఇంకొకప్పుడు తృణశయ్యపై శయనిస్తూ సకలదుఃఖముల పాలు కావడము—ఈ పరివర్తనము—అతి విచిత్రము, అచింత్యము, స్వప్నాతీతము—తాను దలచిన దొకటి, దైవమునర్చే దింకొకటి—యుద్ధమున జయింతు ననిన్నీ స్వతంత్ర నవాబు నౌతానని, రాజ్యమును స్వేచ్ఛగా ఏలుతాననీ అను

కొన్నాను. తుద కేమయింది ? పరాజయము, పరాధీనత, కారాగారవాసము, గడ్డిపోచమాత్రమేనా అధికారము లేక పోయింది. అయ్యో! ఏమి దుర్దశ! ఏమి దుష్పరివర్తనము! ఆలోచన పాలుపోకున్నది. దూలియా! దూలియా! ఎక్కడికి పోయినా వమ్మా! నీలాచలమూ! నీలాచలము! నీ వెక్కడ మాయమైనావు ? ఎందుచేత నన్ను త్యజించినారు ? మీమాట చెల్లినదికా దనే కోపముచేత నన్ను విడిచిపోయి నారా? రహమత్...నీమాట విన్నాను—నీ యాలోచన చాలా అభినందించినాను. పాపిష్ఠా! నీచా! నేడు నన్నింత దుర్దశకు ఈడ్చినవాడవు నీవే! వంగదేశాధికారి నేడు సామాన్యకైదివలె భూతలమున నిద్రిస్తూన్నాడు! ఈ కృతఘ్నత నీకొంప తీయక మానదు...నా తల దిమ్ముపట్టినది.

(పరుండును)

(అబ్దుల్ వచ్చును)

అబ్దు—ఇదే ముకుందదేవుని గది—అబ్బా! ఏమి చీకటి!—అత డెక్కడ పరున్నాడో? దూలియా! నన్నానాడు నరహంత నని అన్నావు, చలములేనివాడ నని నిరసించినావు. నేడు చూచినావా ? నా కిచ్చి వివాహము చేయవలెననే ఉద్దేశముతో నిన్ను చెరసాలలో భద్రపరిచినాడు! కక్కగారుకూడా కారాబద్ధులౌట నయ మయింది. నా మన స్సెలాగో ఉన్న దేమి చెపుమా? నేను పాదుషా నవుతా ననీ దూలియా బేగ మవుతుందని—కాదు కాదు—

నేను బేగమును, దూలియాపాదుషా—అనగా దూలియా పాదుషావలెనే ఆజ్ఞ యిస్తే నేను బేగమువలె దానిని నిర్వర్తిస్తాను అని రహమతన్నాడు. వాహ్వా! ఏమి ఆనందము! ఏది సారాయి?—ఆగు, ఆగు—పని ముందు నిశ్శేషము కానీ...ఏదీ? ఎక్కడ పరున్నాడు? ఆఁ. ఇదిగో ఇక్కడ ఊపిరి తీసేధ్వని వినబడుతూన్నది. ఇక నాలస్యము చేయరాదు. (వక్షమున పొడుచును.)

సులే—అబ్బా! ప్రాణము పోయినది.

అబ్దు—ఎవరిది? ఎవరి కంఠధ్వని యిది?

సులే—అమ్మా! దూ...లి...యా?

అబ్దు—ఏవరిది? కక్కా!

సులే—నీ వెవడవు? అబ్దుల్!

అబ్దు—కక్కా! కక్కా! ఎంత ప్రమాదము జరిగింది! (కౌగిలించు కొనును)

సులే—అబ్దుల్! అబ్దుల్! మంచిపని చేసినావు. నీవు ముకుందదేవుని చంపవలెనని వచ్చినావు, నే నెరుగుదును. కాని, మంచిపని జరిగింది. నా కల కల్ల కాలేదు. నా పాపమునకు నేడు తగిన శాస్తి అయింది. నా పాపసంచయము విను, అంతతో నేను శాంతచిత్తుడనై ప్రాణము విడుస్తాను.

అబ్దు—కక్కా! కక్కా! ఎట్టి పాపిష్ఠిపని చేసినాను!

సులే—నా శక్తి అనుక్షణము క్షీణిస్తూన్నది. కొంత బల ముండగానే నా పాపకృత్యమును వివరముగా దెల్పు

తాను. నీవు నా అన్న కేక పుత్రుడవు, దూలియా ఒక్కర్తే కూతురు. నీ చిన్నతనమున నీ తండ్రి మరణించెను. అందువల్ల నేను నీకు సంరక్షకుడ నైనాను. కాని రాజ్యలోభముచేత నీకు ద్రోహము చేసినాను. నీవు పిచ్చివాడవని రాజ్యమంతా ప్రకటించినాను. నా ఆశ పూర్తిగా ఫలించింది. దూలియాను చిన్నప్పటినుండి కూతురువలె పెంచుచుండడముచేత ఆమె నేనే తనకన్న తండ్రి నని భావించింది. నీవూ అలాగే అనుకొన్నావు.

అబ్దు—దూలియా నా సోదరియా! కక్కా! కక్కా! నే నెంత పాపిని! కక్కా! రహమత్! (పళ్ళు కొరుకును)

సులే—రహమత్ ప్రేరేపణచేతనే ఈపని చేయడానికి సిద్ధపడ్డావని నే నెరుగుదును. కాని జాగ్రత్త. వాడు విశ్వాసఘాతకుడు—ఇటుపైని వాని నమ్మకు—నీలాచలమును వెతకించి అతనిని దూలియానూ రప్పించి నీ రాజ్యము నభివృద్ధిచేసుకో.

అబ్దు—కక్కా! కక్కా! ఎంత రాక్షసకృత్య మొనర్చినాను! రహమత్! అబ్దుల్లా ఎట్టి నరపిశాచియో కనబర్చుతానుండు. ఎట్టి నరహంతకుడో నీవే చూస్తావు. దూలియా! దూలియా! నీ సోదరుని క్షమించు—కక్కా! నా అయోగ్యత సైరించు.

సులే—నాయనా! నేను క్షమించ నేల? ఇది దైవ మొసగిన శిక్ష. నా పాప పరిహారార్థ మిది విధించబడినది. దోషము నీ కావంతా లేదు. నా పాపభారము తొలగించి

నాకు గతి కలిగించినావు. దూలియా! నీలాచలమూ! నా అంత్యకాలమున మిమ్మొక్కసారి చూడలేకపోతిని—అదే నన్ను బాధిస్తూన్నది. ఈ కోరిక మిగిలి పోయింది. అబ్దుల్! ఇదివర కెన్నడూ నీకు తగిన ఆదరము చూపలేదు. ఇప్పుడు నిన్ను సాదరముగా కౌగిలించినాను, ఇదే నాకు పరమానందము, ఇదే నాకు చరమతృప్తి; దీనితో నామనసు చల్లనయింది. అబ్దుల్—ఇటురా!—దూ-లి-యా! నీలాచలమూ!

(మరణించును)

అబ్దు—కక్కా! కక్కా! నీ యమరధామమునకు దయచేయుము! ఆకాశమండలి గ్రహతారకాగణములో చేరి ఉజ్వలముగా ప్రకాశించు. నీ స్వచ్ఛకాంతి ననుసరించి ఆ శక్తిచేత నా కాలము గడుపుతాను. రహమత్! పాపిష్ఠా! నీ ఆలోచన నీ ఉపదేశము నీకే తిరిగీ ఒప్పగిస్తాను. కక్కా! నీ పవిత్రశరీరము నెవ్వరినీ ముట్టనివ్వను, నా చేతులతోనే దీనిని భూస్థాపితము చేస్తాను. అనంతరము నాకర్తవ్యము నిర్వర్తిస్తాను. ప్రతిశోధ—అనుసంధానము—రాజ్యోద్ధారణ...మూడేపనులు.

(పోవును)

(ముకుందదేవు త్వరగా వచ్చును)

ముకు—నవాబుగారూ! లేవండి—(తనలో) పరికించి చూడగా ఇచ్చట కొంతకాల ముండడము శ్రేయస్కరము కాదు. మొగల్ పఠాను సైన్యములు కలిసి నాసేనకు మూడుగె ట్లున్నవి. విశ్వాసఘాతకులు తమవారి కందరికీ

నాయందసూయ అనిష్టమూ కలిగించినారు—నేను విధర్మిని, ముసల్మానులపై అధికారిగా నియోగించబడ్డాను—వారందరూ అమితోత్సాహముతో యుద్ధము చేస్తారు, సందేహము లేదు. ఆ హేతువుచేత నా సైన్యము క్షీణించడము తప్ప వేరు ప్రయోజనము లేదు. నేను స్వయముగా ఢిల్లీకి పోయి యావద్వృత్తాంతమూ పాదుషావారితో మనవిచేసి ఎక్కువ సైన్యము వెంటబెట్టుకొని రావలెను. (పైకి) నవాబుగారూ! లేవండి! (చూచి) ఏమిది? నవాబుగారేరీ? ఖైదీ ఏమయ్యేను? పారిపోయెనా ఏమి? ఎవరక్కడ?

(రక్షకభటుడు వచ్చును)

రక్ష—(కళ్లు నులుముకుంటూ) మహా...

ముకు—ఖైది ఏడీ?

రక్ష—కైదీ...(చూచి)లేడు, మహాప్రభూ!

ముకు—ఏమయినాడు?

రక్ష—మహాప్రభూ! క్షమించండి—నేడు చాలా అలిసిపోయినందున త్వరగా నిద్ర వచ్చినది—ఆపుకో లేకపోయినాను.

ముకు—ఏమన్నావు? అలిసి నిద్రించినావా? ఓఢ్రుని నోట "అలిక" అను మాట నేడు వచ్చినదా? వాని నోట "శయన" మన్నమాట వెలువడినదా? దుర్దాంతులైన మొగల్ సైనికులూ పఠానులూ అనుక్షణము మింగుదామని కనిపెట్టుకొనియున్న ఉత్కళదేశమును రక్షిస్తూన్న ఓఢ్ర సైనికుడవా నీవు? గౌరవమండితమైన కేసరీగంగవంశస్థుల

ఉత్తప్తరక్తవాహిని ధమనులలో ప్రవహిస్తూ ఉన్న ఓఢ్ర
సైనికుడవా నీవు? నీనోట ఇట్టి వినరాని మాట రాకూడునా?
పృథులవిజాతీయసేనాసముఖమున, సమస్తజగత్సమక్షమున
నిజజాతిగౌరవము నిలువబెట్టవలసిన సమయము — అర్హా
వివేకముతో అనుక్షణమూ జాగరూకుడవై ఉండవలసినకాల
మున నిద్రా! కర్తవ్యనిర్వహణసమయమున ఉదాసీనభావమా!
యుద్ధసమయమున అలసభావము! అవసాదము! ఏమిపత
నము! కేసరీగంగవంశమున కెట్టి అధఃపతనము వాటిల్లినది!
గ్రహతారాగణమూ మీ కాంతి మాసిపోలేదు కదా? ఓఢ్రు
లకు క్లాంతియా! ఉత్కళునికి శయనమా! జాతీయగౌరవము
నకు అవసానకాలము ప్రాప్తించినదా? పూర్వప్రతిష్ఠితమైన
దేశమాతపూజ నేటితో పూర్తిఅయినదా? ఎట్టి మాట
విన్నాను? ఎట్టి పని చూసినాను? ఏమి చిత్రము నేడుత్పన్న
మయినది? పవనహిల్లోలమున ఎట్టి ఆర్తనాదము వినబడుతూ
న్నది! ఉత్కళజాతీయత ఉదధిలో మునిగిందా? ఓఢ్రస్వాధీ
నత దశాశ్వమేధఘట్టమున ప్రస్తరముల పైని చూర్ణ
మయిందా?

(తెరలో) మహారాజా! మహారాజా! అని కేకలు.

ముకు—ముకుంద దేవా! మేలుకో! నీ ప్రాణవా
యువు శరీరమునుండి పోవువరకు జాతీయగౌరవము, స్వదేశ
స్వాధీనతా రక్షించు. (పోవును)

## ఐదో దృశ్యము

### శ్రీజగన్నాథాలయము ముందర

నీలాచలము—ఓఢ్ర పండాలు

నీలా—ప్రభూ! జగన్నాథస్వామీ! ఈ పాపిని నీవు దయచూచే దెప్పుడు? నిన్ను ధ్యానించడముచేత నా దేహమందలి రక్తము క్షీణించినది, హృదయమందలి తేజు తగ్గినది—ఇక నోపిక పట్టజాలను దీనదయాళూ! దర్శన మియ్యవా? పతితపావనా! ఈ పాపిపై నీదయ ప్రసరించు.

1 పండా—ఓరీ తురకా! వృథాగా ఎందు కిక్కడ పడియుంటావు? ఇది మసీదు కాదు—నీవు జాతిభ్రష్టుడవు, భగవానునికి నీపై దయరాదు.

నీలా—మహాశయా! నేను పూర్వము హిందువును—శ్రీ చైతన్యస్వామి తురకలను హిందువులలో చేర్చలేదా?

2 పండా—ఏమయ్యో! శ్రీకృష్ణచైతన్యుని మాట ఎత్తుతున్నావు! అతడేమి మాబోటి ప్రాకృతజనుడా? పాషండదాసుడవు, నీవు కిరస్తానీవాడవైన నేమి, ముసల్మాను వైతే నేమి? శ్రీ జగన్నాథస్వామి క్షేత్రపాలకులు ఇతర అధికారులకు నౌకరులు కారు, వారి చెప్పుచేతలలో లొంగి మెలగడానికి! నీ కార్యము సానుకూలము కావలె నంటే తగినంత ధనము కుమ్మరించు—మే మొకరి పోషక వర్గములోనివారము కాము గనుక రాజకీయోద్యోగస్థుల

భయము మాకు లేదు—నీవు తక్కువవాడవు కావు—దాచుకొన్న ధనము దక్షిణగా ఇస్తే తగిన ప్రాయశ్చిత్తము చేసి మా మతములో చేర్చుకొంటాము — మతపరివర్తన మంటే మాటలతో సాధ్యము కాదు.

నీలా—ప్రభూ! శ్రీ జగన్నాధా! ఎట్టి మాటలు వింటున్నాను! వాటివల్ల నా పాపిచెవులు మరింత కలుషితము లవుతూన్నవి—పరమపవిత్రమైన హిందూధర్మమును ఇట్టి పాపభావములచే నిందిత మొనర్చుదువా?

2 పండా—అబ్బా! ఏమి, ధర్మబుద్ధి! వెళ్లవయ్యా! ఇక్కడ ఉంటే నీ కేమి లాభము? ఇంతసేపటినుండి నిలబడ్డావే, రెండు డబ్బులైనా దొరకినవా?

1 పండా—ఏమయ్యా! ఇక నీ విక్కడ నుండ నవసరము లేదు—హిందూమతము నొకసారి త్యజించినవానికి దానిని తిరిగీ గ్రహించడాని కధికారము లేదు, తెలిసిందా?

నీలా—ఈ మత మంత దారుణమైనదా? కాదు కాదు—మహాశయులారా! ఇంకోసారి సరళహృదయములతో ఆలోచించి చూడండి—ఇదిగో నేను నా గుండెలమీద చేయి వేసి శ్రీజగన్నాధస్వామిసాక్షిగా ప్రమాణము చేసి చెప్పుతూన్నాను—అకించనుడనైన నేను యధార్థముగా పశ్చాత్తప్తుడ నైనాను—నా పాపపరిహారార్థమై మీ రేశిక్ష విధించినా దానిని శిరసావహిస్తాను. ఒక్కసారి నాపై ననుగ్రహించి నన్ను హిందూమతములో చేర్చండి—నేను మాఅమ్మ

శరణసేవ చేసుకొంటాను—నా ధర్మపత్నిని కూడి సుఖముగా గార్హస్థ్యము నడుపుకొంటాను—మీరు చేసిన మేలు ముగ్గురు భక్తుల కానందదాయక మవుతుంది.

2 పండా—వెళ్లవయ్యా! నో రున్నదని ఏదో వదరుతూన్నావు—నీ పాండిత్యమునకు మెచ్చి ఏమైనా పారితోషిక మిస్తా మనుకొన్నావా?

నీలా—మీరు పండితులే! మీ కిట్టి అయోగ్యాచరణము తగునా?

2 పండా—అయ్యా! ఇటు వినండి—మేము పండితులమా? ఓయి వెర్రివాడా! మేము పండితులము కాము—నీవు పండితుడవా? డబ్బు తెచ్చికుమ్మరించు—అప్పుడు మా పాండిత్యము నీకు బోధపడుతుంది—ధన మిస్తే తగిన ప్రాయశ్చిత్తము చేయిస్తాము—వట్టి మాటలకూ మంత్రాలకీ చింతకాయలు రాలవు!

నీలా—ధర్మవిచారము ధనము నాధారపడి యుంటుందా? వివేక మక్కరలేదా? పాపపరిహారము పాడు డబ్బువల్ల ప్రాప్తిస్తుందా? పశ్చాత్తాపమునుబట్టి కాదా? ఇదా హిందూమతాచారము! అతిసనాతనము, నానా శాస్త్రాలంకృతము నానాఅవతారపరిశోధితమైన హిందూమత మిదా? దాని పరిణామ మిట్టిదా? అసంభవము—అసంగతము ప్రభూ! నీలాచలనివాసా! అంతా చూస్తున్నావా? ఈ దీనునిపై దయలేదా? ఈ పాపియెడ ప్రసన్నుడవు కావా.

2 పండా—అబ్బో! ఈ యవనుడు భాగవతాగ్రేసరుని వలె నున్నాడు. గొప్పపండితమ్మన్యునిలా గున్నాడు.

1 పండా—కగలవే మయ్యా! తురకమొగము ప్రొద్దుటనే చూస్తే ఆ నాడు దినచర్య తీరడ మతికష్టము—ఇతనిని వెడలనడపకుంటే ఇక మనకు క్షేమము కాదు. కాపరులారా! మీ కేమీ కనబడలేదా? యవను డొకడు నెలరోజులు ఇక్కడ పడిఉండి సింహద్వారము అపవిత్ర మొనరించినాడు, మీరు సరిగా ద్వారము కాపాడలేదు.

1 కాపరి—మీరు పండా లయిఉండి మాటాడరా మెను. తెలిసిన పండితులు మీరే పోగొట్టజాల కున్నారు, మూర్ఖులము మా చేత నే మౌతుంది. అదీకాక అతడు ముక్తిమండపసభకు దరఖాస్తు చేసినాడని విన్నాము.

1 పండా—ఆ దరఖాస్తు మంజూరు గాలేదు—ధనము ఇవ్వకుంటే దరఖాస్తెవరు చూస్తారు? ఇతనిని మీరు తోలి వేయవచ్చును.

2 పండా—గెంటివేయండి ఇప్పుడే — తురకవాడు చాలా గడుసరి. పైసా ఇవ్వకుండా పాపపరిహారము కావలె నట!

నీలా—ప్రభూ! జగన్నాథా! నా పాపము పరిహార మవుతుందని పుట్టెడాశతో వచ్చినాను. నన్ను నిరాశుని చేయకు—నీ సేవకులను సరళమనస్కులను చేయుము—ఈ పాపి నుద్ధరించు.

1 కాపరి—ఓయీ! దొంగ జపము చేసే దొంగా! దారిలో లే.

2 పండా—యాత్రీకు డనుకొన్నావా? ఏమి? బ్రతిమాలుకొంటున్నావు. తగలనీ రెండు—అంతతో గాని బుద్ధిరాదు.

1, 2 కాప—తగలనీ నాలుగు, తనంతట తానే దాటుతాడు (కొట్టుతారు)

నీలా—ప్రభూ! ఆర్తత్రాణపరాయణా! ఇదా నీవు నాకు విధించిన శిక్ష? నీవు కరుణాసముద్రుడవు—కారియ వెట్టుదువా నన్నిట్లు కాని! నీయాజ్ఞ శిరసావహిస్తాను—ఇంతతో నా పాపము పరిహార మగునట్లు వర మిమ్ము. ఇంతతో హిందూసంఘమున నన్ను చేర్చు.

1 పండా—ఇంకా ఏమో పేలుతూన్నాడు, తల తిరు గింకా పోలేదు—మెడబట్టి గెంటు—చేయి పట్టుకొని బైట కీడ్చివేయి.

(కొట్టబోతూండగా దూలియా వచ్చును)

దూలి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఏమి ఈగతి!

2 పండా—ఒరే ఈ పెద్దమ్మ ముండ నుంచినాడు రా తన్ను ఇద్దరినీ! (కొట్టగా దూలియా మూర్ఛిల్లును)

(ఫిరోజావచ్చును)

ఫిరో—ఓరీ నరాధమా! ఓరి రాక్షసులారా! ఏమి ఘోర మిది!

2 పం—ఇంకొకర్తె రా! తగలనీ! కొట్టు (కొట్టుదురు)

(పద్మానసుడు వచ్చును)

పద్మా—ఏమి యీ ఘోరము! శ్రీ జగన్నాథస్వామి వారి సన్నిధినే అత్యాచారమా? నిర్భరము! నిర్భరము! పండాపండితులారా! మీ వాక్యార్థమునకు నిదర్శన మిదా? మీ ధర్మాచరణముకు దృష్టాంత మిదా? ఇట్టి ఆచరణము వల్లనా హిందూమతము మీరు నిలువబెట్టడము? శ్రీ నీలాచలవాసుని మహిమను మీ రీవిధముననా కీర్తిస్తూన్నారు? ఛీ ఛీ! చాలు! పండితులకు నే డెంత బుద్ధిహీనత సంక్రమించింది? పండా లీ దినమున ఎంత నీచముగా ప్రవర్తిస్తూన్నారు!...ఆర్యా! మీ తాపము శాంతించుగాక! మీరు పశ్చాత్తాపపడండి! మీ పాపపరిహారార్థము స్వామిని ధ్యానించండి, మీ కోరిక సిద్ధిస్తుంది.

2 పండా—ఓరి ధూర్తుడా! నీ సాహసము మాను—కొట్టండి—మర్దించండి—వీడికి బుద్ధి వస్తుంది. (పద్మానసుని కొట్టుతారు)

పద్మా—ప్రభూ! నీలాద్రినాథా! ఈ బీభత్సలీల అంతా చూస్తూ ఊరకుంటూనా? (నీలాచలము లేచును)

పండా—ఓరీ! తురక లేచినాడు—కొట్టండి చచ్చేటట్టు. (అతనిని కొట్టబోదురు)

పద్మా—నన్ను కొట్టండి మీ కోపిక ఉన్నంతవరకు—నాకళ్ల యెదుట ఎవరైనా శిక్షింపబడుతూండగా నే నోర్వ

లేను—హిందూమత మింత అధఃపతన నుపుతూండగా చూచి సహింపలేను.

(పద్మానసుడు నీలాచలము కడ్డుగా నిలువబడగా
అతనిని కొట్టుదురు—అతడు మూర్ఛ నొందును)

నీలా——(కోపముతో లేచి) హిందూజాతి ఇంత హీన మయినదా? హిందూధర్మ మింత హింస్ర మయినదా? నీచాశయులారా! నీచ ప్రాణులారా! మీ రెంత మీరిపోయి నారు! ఎప్పటికైనా మీబుద్ధి తిరుగదా అని ఇంతకాల మోపిక పట్టినాను; ఇక సహించలేను. నన్ను కొట్టినారు, ఓర్చినాను— ఇంకొకర్తెను కొట్టినారు, తిట్టినారు, నోటికి వచ్చినట్లు నిరసించినారు—ఓర్చినాను— అపరిచితుడు—బుద్ధిశాలి, మా ప్రాణములు రక్షింప సమకట్టినవాడు—అట్టి సదాచార సంపన్నుని చావ మోదినారు—ఈ దుష్కార్య చూచి సహింప లేను! మీ క్రౌర్యము మితిమీరినది.

2 పండా——అబ్బో! ఈ యభాజను డలిగినాడు— పదండి పోదాము. (పో బోవుదురు)

నీలా——పారిపోకండి — ఎలుకలారా — పరుగెత్తకండి — ఇప్పుడు మి మ్మేమీ చేయను — భయపడకండి—మిమ్ము కొట్టి నామర్యాద పోగొట్టుకోను—ఒకవేళ కొట్టినా మీకు తగిన శాస్తి కాదు. మీకు తగిన ప్రాయశ్చిత్త విధానము వివరి స్తాను వినండి—మీ మతౌద్ధత్యమునకు తగినమందు చెప్పు

తాను వింటారా! మీకీ బుద్ధి పుట్టించిన మీ దేవుని కేమి గతి పట్టగలదో వినండి—నిలువండి—జాగ్రత్తగా వినండి—

అందరు—ఏమి టది? ఏమి టది?

నీలా—ఓరీ నరపిశాచములారా! మీ రీ నిరపరాధుల యెడ ఎట్టి అత్యాచారము సల్పినారో, ఈ న్యాయవర్తనుని యెడ ఎట్టి నృశంస మొనర్చినారో—అదే తీరున, అంత కన్న తక్కువ కాకుండా మీ రనుభవించేటట్లు చేస్తాను—ఇక నా మాట నా శరీరమునకు, నరములకు, కీళ్ళకు ఎట్టి బాధ మీరు కలిగించినారో అ బాధ మీవారందరూ ఆ బాలగోపాల మనుభవించేటట్లు చేస్తాను.

పద్మా—ప్రభూ! శాంతించండి. అంత కోపము వద్దు వీ రశక్తులు.

నీలా—వీరా! రాక్షసులు! నరపిశాచములు! వీళ్ళయెడ శాంతము కూడదు. ఇట్టి అపకీర్తి గడిస్తూన్న జాతి—యిట్టిశిక్ష నా దేసిస్తూన్న ధర్మము,—ఇట్టివాళ్లు ఆరాధిస్తూన్న దైవము—ప్రాణశూన్యము, జడతాపూర్ణము, కర్రబొమ్మగా ఉన్న గనుక—వీటి నన్నిటిని చూర్ణముచేసి మట్టిలో కలపవలసినదే! ఈ జాతియొక్క గర్వమునకు కీర్తికిన్ని ముఖ్యాధారమైన ఈ కోవెలను ధ్వంసము చేయవలసినదే! పుణ్యక్షేత్రమైన పూరిని సముద్రములో కలిపివేస్తాను. అప్పు డుత్కళరాజ్యము హీనతేజమై మృతప్రాయ మవును. భారతవర్ష మంతా అగ్ని పర్వతము పేలి భూకంపము పుట్టగానే పృథ్వి అంతా కను

రెప్ప వేయకుండా చూస్తూంటును. ఇక్కడి జనుల రక్తము బంగాళాఖాతమును సిక్తము చేయుగాక! వీరిశవములు భూమి యందు గుట్టలవలె పెరుగును గాక! వీరి బంధువుల మొరలచే దశదిశలు మారుమ్రోగుగాక! హిందూజాతి నాశనము కావలె—హిందూధర్మము శూన్యము కావలె—వీరి దైవము సముద్రములో మునుగవలె—మహామందిరము మట్టిలో కలియవలె—నా చిత్తమునకు శాంతి కలుగవలెను.

పద్మా—ప్రభూ! ప్రభూ! అంత కోపమా ఈ ప్రాకృతులయెడ!

(అందరూ అడలిపోదురు తెరవాలును)

# నీలాచలము

## మూడో అంకము

### మొదటి దృశ్యము

ఆలోచనా మందిరము—అక్బరు సభాసదులు.

అక్బ—ఎంత మోసము ! ఎట్టి విశ్వాసఘాత !

వీరబలుడు—మహాప్రభూ ! ఇప్పుడు బోధపడినదా ? మీ రెంతో విశ్వసించినారు !

అక్బ—వీరబలా ! విశ్వాస ముంటేనే కాని రాజ్య పాలన సాగదు.

వీర—నా విషయమున మాత్ర మందుకు వ్యతిరేకము కాబోలు !

అక్బ—ఏమి ? నిన్ను నేను నమ్మలేదా? నీవు నాకు ప్రధానసభాసదు డవే.

వీర—అది నిజమే—ఈ వేషము వేసినంతవరకు, ఈ సభలో నున్నంతసేపు, నేను మాటలాడినంతసేపు నన్ను నమ్ము తారు.

అక్బ—నీ మాటల గూఢార్థము నాకు బోధపడలేదు.

వీర—సభాసదు లాడే మాటలతీరు వేరు, అది మీకు సులభముగా బోధపడుతుంది; నా మాట లలాగు రుచించవు.

అక్బ—నీవు చెప్పే దేమిటి?

వీర—కతలూఖాన్ నైజము బోధపడ్డదా ప్రభువు వారికి?

అక్బ—ఇప్పటి చర్యను సంబంధించియా?

వీర—కాదు, కాదు పురాతన వృత్తాంతమును బట్టి అప్పుడు నా మాటలు కేవల పరిహాసవచనము లని ప్రభువవా రెంచినారు.

అక్బ—నీ మాటలు గూఢార్థములు కలవని మొదట నే చెప్పలేదా? కాని కతలు ఆ బాల్యము పుత్రప్రాయముగా పెరిగినవాడు—సామాన్యసైనికపదవినుంచి సేనాధిపత్య పదవి కుద్ధరించబడినవాడు—వీ డింత స్వామిద్రోహి కాగలడని నా కెప్పుడూ తోచలేదు, కలలోనైనా ఇది సంభవిస్తుందని నేను తలచలేదు—వా డిట్టి బుద్ధిగలవానివలె ఎన్నడూ ఆచరించ లేదు.

వీర—ఎందు కాచరిస్తాడు? హింసాదేవి అప్పు డతని హృదయపీఠియందు తాండవ మాడలేదు.

(ముకుంద దేవు వచ్చును)

ముకు—పాదుషావారి కభివాదనము.

అక్బరుమహారాజుగారి కభివాదనము — కాని మహా రాజా! నన్ను మిత్రునిలాగు పిలువక పాదుషా అని సంబోధిస్తారేమి?

ముకు—మహాప్రభూ! మీ వంటి నిస్తులపదస్థులకు మిత్రుడగు యోగ్యత నా బోటివాని కున్నదా?

అక్బ—మహారాజా! యోగ్యత మీకు లేదా? శ్రీ జగన్నాధస్వామిసాక్షిగా మీరు వీరశ్రేష్ఠులనీ, స్వాధీననర పరతులని, సహజబంధువులనీ ప్రతిష్ఠితము కాలేదా మీకీర్తి?

ముకు—క్షమించ వేడుతూన్నాను—ఈ పొగడ్తకు నేను తగను. నాబోటి సర్వసామాన్యు నింత పెద్దచేయడము ప్రభువుగారి ఆశ్రితవాత్సల్యము ప్రకటిస్తూన్నది.

అక్బ—మిమ్ము తగినరీతిని ప్రశంసించలేనైతినని చింతిస్తూన్నాను. మీ గుణములు తగినరీతిని లెక్కించనేరను— ఒక్కమాటకు సమాధాన మివ్వండి—పరునకై స్వార్థత్యాగ మొనర్చి, ప్రాణములనైన అర్పింప సిద్ధపడి, విధర్మియైన మిత్రునకై పాటుపడే మహనీయు లెంతమంది యుందురు?

ముకు—మీ కొరకు నే పడ్డపాటేమి?

అక్బ—గొప్పపాటు కాదా? కతలు రహమత్ ఖానుల విశ్వాసఘాతచేతను మీ సైన్యము స్వల్ప మౌటచేతనూ యుద్ధమున జయము పొందలేదు సత్యమే, కాని ప్రయత్న లోప మం దేమున్నది? ఆ కొరత తీర్చుటకే కదా మీ రిక్కడికి వచ్చినారు.

ముకు—వట్టిమాట లెందుకు? నాకు సెల విప్పించండి-యుద్ధమున జయము లభించేవరకు విశ్వాసఘాతకులను మీ సమక్షమున చేర్చే పర్యంతమూ నా చిత్తమునకు శాంతిలేదు.

అక్బ—మంచిదే కాని నేడు మీరు ప్రయాణము కావద్దు—ఇంకా కొద్దిరోజులాగి తగిన బలము వెంట తీసుకొని పోవచ్చును.

(మానసింహుడు వచ్చును)

మాన—మహాప్రభూ! అభివాదము—దాదాపు పది వేలసైన్య మిప్పుడు సుసజ్జితముగా నున్నది.

ముకు—సమృద్ధి—నా సైన్యమును కూడా సిద్ధముగా నుండుమని కబు రంపినాను.

మాన—(తనలో) స్వదేశము! స్వసైన్యము! ఈమాటలనదగు రాజన్యు లెంత ధన్యులో! అంతకన్న ఎక్కువ సౌభాగ్యము రా జన్నవాని కున్నదా?.

ముకు—మహారాజా! అంతా సిద్ధమే కదా?

మాన—(తనలో)"మహారాజు!" ఎవరు మహారాజు? ఈ పరాధీనుడా? ఈ పరాన్నభోజియా! ఛీఛీ! ఈ క్షత్రియాధముని యెడ అట్టి సంబోధన రాజపదమున కెంతో అవమానమూ అమర్యాద తెచ్చును. (పైకి) రాజచంద్రమా! సర్వము సిద్ధము.

ముకు—అక్బరు సార్వభౌమా! అంతా సిద్ధముగా నున్నప్పుడు ఇంక నాలస్యమెందుకు?

అక్బ—నామాట చెల్లించి నాలుగురోజు లాగ కూడదా ?

ముకు—అగత్యమైన కార్యము నెరవేర్చినపిదప మీ ఆజ్ఞా ప్రకారము మీచిత్తమువచ్చినంతకాలముగడుపవచ్చును.

అక్బ—మిత్రమా! నీయట్టి మిత్రుడు లభించడము అరుదు—నీతోడి చెలిమి తనివితీర్చేది కాదు. సజ్జనుల మైత్రి సంతతమూ అభ్యర్థనీయము.

ముకు—ఆహా! ప్రభువుగారి వాత్సల్య మెంత విస్తృతము! నాబోటి అకించనులకు కూడ ఉత్తమపదవి లభింపజేసింది.

అక్బ—నాభాగ్య మెంతని వర్ణింతును? సకలహిందూ జాతికి నాయకమణి యనదగు ముకుంద దేవుని మైత్రి ఘటిల్లి నది! రమ్ము మిత్రమా! విశ్రామాగారమునకు పోదాము—
(వా రిద్దరూ పోవుదురు)

మాన—(తనలో) ముకుంద దేవు క్షత్రియుడు. మాన సింహుడూ క్షత్రియుడే—ఆతడు మిత్రుడు—ఈతడు భృత్యుడు—అతడు సింహాసనమున, ఇతడు పదతలమున—ఇద్ద రికీ స్వర్గమర్త్యముల కున్నంత తేడా! అతనికి సౌఖ్యము, ఇతనికి యాతన!

వీర—మిత్రమా! ఎందుకు దుఃఖిస్తావు? రా—మన మిద్దరమూ మిత్రులము ప్రభువు ప్రభువును కౌగిలించినట్లే భృత్యుడు భృత్యుని కౌగిలించకూడదా?

ద్వారపాలకుడు—మహారాజా! పండితవర్యా! పాదుషా వారు మీకు కబురంపినారు.

మాన—కబురంపట మేమిటి! ఆజ్ఞాపించినా రను. (తనలో) ఏమి తలవంపులు! నాక్షత్రియవీర్యము, నాక్షాత్ర తేజమునూ సేవకావృత్తివల్ల చెడిపోయినవి.

వీర—మిత్రమా, రా—పాదుషావారి ఆజ్ఞ అయినది. (ద్వారపాలకునితో) మిత్రమా! ముందు నడువు—తెల్లబోతా వేమి? పాదుషావారికి మనమిద్దరమూ సేవకులమే—నీవు పాదుషావారి ద్వారము కాచుకొని యుంటావు. నేను వారి బుద్ధిని కాచుకొని యుంటాను. ఇదే తేడా! పద, మిత్రమా, పద—(వెళ్లుదురు)

మాన—వీరబలుని మాట సత్యము. (వెళ్లును)

---

## రెండవ దృశ్యము

ఇల్లు.

రహమత్—అబ్దుల్ (మారువేషముతో) కతలు.

రహ—(తాగి) ఓరే, కుర్రవాడా, నీ పేరు?

అబ్దు—నా పేరా?...నా పేరు—కుర్రవాడు.

రహ—ఓరి మూర్ఖా! అది నేను పెట్టిన పేరు—నీ అసల్ పేరు?

అబ్దు—నా పేరు చెప్పినాను—కుర్రవాడు—అదే పేరు.

రహ—(తాగి) సరే అదే కానీ—పోనీ—నీ పేరు జలిల్. ఇది నేను పెట్టిన పేరు.

అబ్దు—మహాప్రభూ! నా పేరు జలిల్ – బాగా కుదిరింది.

రహ—సరే—జలిల్, నే నెవడను?

అబ్దు—మీరు నవాబుగారు.

కత—నేనో?

అబ్దు—మీరూ పాదుషావారు!

రహ—కాదు—నేనూ పాదుషాను—(నవ్వేను)

కత—కాదు, నేను పాదుషాను.

రహ } కత }—జలిల్, నీవు నిజము చెప్పు, నే నెవడను?

అబ్దు—ఇదిగో—నే నాలోచించి చెప్పుతాను, కొంచె మాగండి...మీరు నవాబుని చంపినారు గనుక నవాబులైనారు. (కతలుని చూపి) మీరు పాదుషావారిని వంచించినారు గనుక మీరు పాదుషాలైనారు.

రహ } కత }—బాగా చెప్పినావు. (అబ్దుల్ వీపు తట్టుతారు) మంచి కుర్రవాడవు—సారా తీసుకొనిరా. (తాగి తాగి స్పృహలేక పడుదురు)

అబ్దు—మంచి తరుణము ప్రాప్తించింది నా పని నెరవేరడానికి (వేషము మార్చి బాకుతీసి) రహమత్, నీ విచ్చి

నదే ఈ బాకు. దీనిని పట్టుకొని నీ ప్రేరేపణవల్ల భ్రాతృకల్పుడగు నీలాచలమును చంపవలెనని వెళ్లినాను. నా సోదరి దూలియా బహిఃప్రాణము హరించవలెనని సిద్ధపడ్డాను. కాని భగవంతుడు కానిచ్చినాడు కాడు. రెండోసారి నీ ప్రోత్సాహమువల్లనే నా కక్కాగారి ప్రాణము తీసినాను. రాజద్రోహిని పితృఘ్నుడను ఐనాను (వెడ నవ్వుతో) తండ్రికి తగిన పుత్రుడను! రాజుకి తగిన బంటును!...ఇదిగో చూడు! ఏ మిత్రుని ఉపదేశముచేత ఇంత యోగ్యుడనైనానో, రాజ్యమునకూ బంధుకోటికిన్నీ ఎట్లుపచరించినానో అలాగే ఆమిత్రునికి కూడా ఉపయోగించవలెను కదా! అట్టి ఘనకార్యమునే ఆచరిస్తూన్నాను. (రహమత్‌ను చంపబోయేసరికి లోపలినుండి తుపాకి పేలి ఆగుండుదెబ్బతో అబ్దుల్లా పడిపోవును; వెంటనే నీలాచలము వచ్చును. రహమత్ కతలుఖాన్‌లు లేచి భయముతో నిలబడి యుందురు)

నీలా—నవాబుగారూ! వేగము మెలకువ తెచ్చుకోండి. ఇ దెవరు? నవాబుగా రేరీ! ఇదిగో రహమతాలీ!

అబ్దు—అయ్యో! విశ్వాసఘాతకుని ఋణము తీర్చలేకపోతిని; నా మనసులోని కోరిక నెరవేర్చుకొనలేకపోతిని. కక్కా! కక్కా!

నీలా—ఏమి అబ్దుల్లా!

అబ్దు—నీలాచలమూ! సోదరా! నీవేనా? తిరిగీ వచ్చినావా?

నీలా—అయ్యో! ఎంత పొరపాటు చేసినాను!

అబ్దు—నీది పొరపాటు కాదు. నా పాపముకు తగిన శాస్తి అయింది.

నీలా—పాప మేమి? శాస్తి ఏమి!

అబ్దు—ఆ పాపము పేరు చెప్పితే పాపము, వింటే పాపము.

నీలా—నా ఉత్కంఠను హెచ్చించక త్వరగా చెప్పు.

అబ్దు—రాజహత్య! పితృహత్య! పాపద్వయము.

నీలా—ఏ మన్నావు? నవాబుగారు లేరా? రాజుగారు లేరా?

అబ్దు—ఉన్నారు—స్వర్గమం దున్నారు—గ్రహతారాగణములో లీనమైనారు. అదిగో చూడు—దివ్యమూర్తి ధరించి దివ్యాసనాసీనులై, దివ్యజ్యోతి దిశలందు వ్యాపింపజేస్తూ, నావైపు తీక్ష్ణదృష్టిని నిగుడించి పళ్లు పటపట కొరుకుతూన్నారు...ఏదీ, ఆ బాకు నిటు తే—విశ్వాసఘాతకునికి శిక్ష కానే లేదు. పాపికి శాస్తి కానే లేదు, నేను చేతామను కొన్న పని చేయనే లేదు—(లేవబోయిపడిపోవును)

నీలా—ఏమి టాపని?

అబ్దు—విశ్వాసఘాతకునికి తగిన శాస్తి—పాపి రహామత్ కి—

నీలా—తెలిసింది—ఈ పాపిష్టి రహామతే సర్వనాశము నకు కారకుడు—ఎవ డక్కడ?

(సైనికుడు వచ్చును)

ఈతని చెరలో పెట్టు (కతలుని చూసి) నీ వెవడవు?

కత—నేను... నేను...క...త...క...

నీలా—త్వరగా చెప్పు. ఎవడవు నీవు?

కత—మహాప్రభూ! నేను కతలుని.

సైని—ప్రభూ! ఇతడు మొగల్ సేనాధిపతి—విశ్వాస ఘాతకుడై మనలో చేరినాడు. రహమత్ కి ఆంతరంగిక మిత్రుడు.

నీలా—ఇతడూ విశ్వాసఘాతకుడే? మిత్రుల నిద్దరినీ ఎడబెట్టరాదు. రహమత్ చేతితో వీనిచేయి కలపండి—అయ్యో! నవాబుగారిక కనబడరు—అబ్దుల్ నే నెంత ఘోరము చేసినాను! (కౌగిలించుకొనుచు)

అబ్దు—సోదరా! చింతించి ప్రయోజనము లేదు... దూలియా ఏది? ఆమె నా సోదరి! చెల్లెలు! ఆమె నన్ను సోదరుని లాగు ఆదరించేది, నేనుమాత్ర మామె నెంతో కష్టపెట్టినాను. ఆ పాపము నశించే సూత్రము లేదు.

(దూలియా వచ్చును)

దూలి—తప్పకుండా ఉంది, ఎవ రా మాట అన్నది?

నీలా—దూలియా, నేను మహాపాతక మొనర్చినాను. సర్వము ధ్వంస మయింది.

దూలి—ప్రాణేశా! అలా గంటున్నా రేమి?

అబ్దు—ఏమి లేదు చెల్లెలా!

దూలి—ఎవరిది? సోదరా! (దగ్గరకు పోవును) అబ్దుల్లా!

అబ్దు—నేను నీ సోదరుడను కాను శత్రువును—దేవీ తుల్యవైన నీ సోదరుడ ననిపించుకోవడానికి రాక్షసుడ నైన నేను తగను. (చెవిలో చెప్పును)

దూలి—సోదరా! నీకిట్టిగతి ఎట్లు దాపురించినది? అయ్యో! అయ్యో!

అబ్దు—ఇది సుదశ! చెల్లీ—ఇటు రా! నా ప్రాణ సమానవు—బ్రతికున్నన్నాళ్లు నిన్నిలాగు ఆదరింపలేదు. ప్రాణప్రయాణసమయమున నిన్ను సోదరప్రేమతో గౌర వించి నా జీవితము సార్థకము చేసుకొంటాను.

దూలి—అన్నా! నాకు మహానందము కూర్చి వెంటనే విడిచి పోవుదువా? తండ్రిగారు తరలినారు—నీవు కూడా పోవ జూస్తున్నావా? నన్నెవరి కప్పగించుతావు.

నీలా—ప్రాణేశ్వరీ! ఈ సర్వనాశమునకు కారణ భూతుడను నేను.

దూలి—అ దేలాగు?

నీలా—నా గుండుదెబ్బ నీ సోదరుని ప్రాణము తీసినది.

అబ్దు—సోదరీ! అది దైవప్రేరితము—నా పాపమునకు పరిహారమిది నీ కెంతో మేలొనగూర్చింది...ఎవని ప్రేరణము వల్ల నేను తండ్రిని చంపినానో ఆ నరపిశాచము వీడే!... దూలియా! నే నెంతో కాలము జీవించను—నా తుది మాటలు

విను—నేను చేయువలసిన పనులు మూడు—మీ భార్యాభర్తలను వెతకించడము—రాజ్యోద్ధారణము—ఈ రెండూ పూర్తి అయినవి. ఇక మిగిలి ఉన్నది—నీ పితృభ్రాతృహత్యలకు ప్రతిక్రియ—రహమత్ కు తగిన శాస్తి—

నీలా—ఆ భారము నాది.

అబ్దు—ఇక నాకు చింతలేదు—సోదరీ! నన్ను క్షమించు...(మృత్యువు)

దూలి—అయ్యో! బంధుహీననైనాను. పుట్టిల్లు మట్టిలో కలిసింది. ఈదుఃఖ మేలా గుపశమించగలదు?

నీలా—ప్రాణేశ్వరీ! చింతించకు! ఈ నరపిశాచముల రక్తవర్షముచేత నీ దుఃఖ ముపశమిస్తుంది.

(పద్మానసుకు వచ్చును)

పద్మా—అయ్యో! రక్తవృష్టిచేత తప్తప్రాణము చల్లబడుతుందా! రక్తపాత మెప్పుడూ భగవంతునికి ప్రీతిదాయకము కాదు.

నీలా—ఈ సామాన్య రక్తపాతము సర్వేశ్వరాభిప్రేతము కాదు, కాని ఇకముందు నేను ఉపక్రమింపదలచుకొన్న మహారక్తపాతము ముందర యీరక్తపాతము బిందుమాత్రము.

పద్మా—ప్రభూ! ఈ దారుణప్రతిజ్ఞ మానండని మా ప్రార్థన. అట్టి నృశంస మీబోటి వీరుల కుచితము కాదు. మానవశ్రేష్ఠులయిన మీ కట్టి రాక్షసకృత్యము తగునా!

వివేకవంతులయిన మీ రట్టి పాశవకర్మ చేయవచ్చునా? దానిని చూచిన దివ్యు లేమంటారు? మర్త్యలోకమందలి వా రేమని ఎంచుతారు? పాతాళమందలి నాగగణ మేమని చెప్పుకొంటారు? ఇందరి కసమ్మతమైన కార్యము మీ రొనర్చకూడునా?

నీలా—(నవ్వి) ఒకరు నిందిస్తారని నా ప్రతిజ్ఞ మానుకొంటానా? బ్రహ్మ తన చతుర్ముఖములతోను నన్ను కుత్సితుడననీ, మర్త్యు లందరూ సృష్టిఅంతా మారుమ్రోగేటట్లు నాకీర్తి కది కళంకము ఘటించిందని కేకలు వేయనీ, అనంతుడు తన రెండువేల జిహ్వాలతోనూ నన్ను నిందించనీ—నా ప్రతిజ్ఞ విడువను—ఇది ముమ్మాటికీ నిజము—నా మనోనిశ్చయము మారదు.

పద్మా—"నిందాభయము నాకు లేదు" అని కదా సెలవిచ్చినారు—పోనీయండి—పాపభీతి ఉంది కదా? మీ అంతఃకరణమును కొంచెము పరీక్షించండి—అందలిదయాక్రందనము కొంచెము వినండి, అనుకంపను కొంచెమనుభవములోకి తెచ్చుకొనండి. అప్పుడు మీ ప్రతిజ్ఞ ఏమవును? అందువల్ల మీ కెంతకాఠిన్యము అలవడగలదు? మీ మనోనిశ్చయము మారునాలేదా?

నీలా—బాలకా! ఊరకుండు......హృదయమా! ఎందుకు కంపిస్తావు? మేరుమందరములవలె దార్ఢ్యము వహించు—క్రూరవృత్తిచయమా! కాంతి మాయకు—నేను వేల్చిన అగ్నిహోత్రములాగు ప్రజ్వలించు-కోమల-ప్రవృత్తి

చయము కూలిపోవును గాక! ఇహబంధనము లన్నీ తెగి శూన్యములగు గాక! నా శ్వాస ఝంఝామారుత మగు గాక! నా మాటలు వజ్రనిర్ఘాతము లగుగాక! నేను నరహంత నయితీరుతాను. నరరక్తలోలుపుడైన రాక్షసుడ నౌతాను, నా ప్రతిజ్ఞ నెరవేర్చి తీరుతాను—హిందూధర్మము రూపుమాపుతాను; హిందూజాతి ధ్వంస మొనర్చుతాను.

కతలు—మహాప్రభూ! ఈ దాసునికి ప్రాణదాన మిచ్చితిరా, మీ ప్రతిజ్ఞా నిర్వహణమునకు నా చేతనైన నంత సాయము చేస్తాను.

రహ—ఈ దాసుని అభిలాషకూడా అదే మహాప్రభూ!

నీలా—(తనలో) వీరిసాయ మపేక్షించుచునా! నా ఉద్దేశము సాధించడమునకిట్టి విశ్వాసఘాతకులు తోడ్పడ వలసినదే—ఇట్టి ఆతతాయిలతో మైత్రి ఆవశ్యమే—కతలూ నీ ప్రాణము రక్షించినాను—నేటినుండి నీవు నా సేనాధిపతివి.

కత—చేతులు కట్టుకొని ప్రభువువారిని సేవిస్తాను.

రహ—మహాప్రభూ! ఈ దాసునికి కూడా ప్రాణదానము చేయరా? ప్రభూ!

నీలా—సరే—అలాగే చేస్తాను.

దూలి—నే నట్లు చేయలేను, ప్రాణేశ్వరా! ఆతతాయికి ప్రాణదానమా! నా తండ్రిని చంపినవానిని మీరు రక్షిస్తారా! అంతే కాదు—నా సోదరుని మృతికి కూడా వీడే

కారకుడు—ఇట్టివాని ప్రాణము రక్షింతురా? తుట్టపురుగుతోడి చెలిమి కూడునా?

నీలా—ప్రాణేశ్వరీ! ఈ విషయమున దండవిధానము నీవే నిర్ణయించుము.

దూలి—నేను దండించవలెనా? ఏ దండన విధింతును? తగినశిక్ష ఏది? ఇప్పుడు నిర్ణయించలేను — ప్రాణేశ్వరా! మీరే నిర్ధారణ చేయండి.

నీలా—అలాగు కాదు, ప్రాణేశ్వరీ! నీ తండ్రి నితడు చంపినాడు గనుక నీవే తగినశిక్ష విధించు—ఇప్పటిమట్టు కితడు చెరలో నుండనీ శిక్షానిర్ణయ మయినదాకా చీకటికొటారులో పడి యుండనీ.—కతలూ, నీవుకూడా వీనివెంట వెళ్లు.

రహ—యువరాజ్ఞి! యువరాజ్ఞి! (కతలు తీసుకొని పోవును)

దూలి—(అబ్దుల్లా శవము చూచి) అయ్యో! సోదరా! నన్ను విడిచి పోతివా?

నీలా—శోకించడాని కిది వేళ కాదు—ప్రతిహింస ఒనర్చవలెను. (పోవును)

దూలి—నిజమే—ప్రతిహింస ప్రస్తుతకార్యము

(పోవును)

పద్మా—చెల్లెలా! ప్రభూ! ఇదా మీ కర్తవ్యము!

(పోవును)

---

## మూఁడో దృశ్యము

అంతఃపురము—పద్మాననుడు.

పద్మా—ఎన్ని విధముల తర్కించినా ఆయనమనసుకి నచ్చచెప్పలేకపోతిని. దూతియా మూలమున కొంతకార్య సిద్ధి కావచ్చును. ఆమె కోపము కొంత ఉపశమింపగల్గినాను. నరహత్యకు ప్రతిక్రియ నరహత్య అట! స్వజనహత్యాజనిత శోకము హంతకుని చంపడమువల్ల ఉపశమించునా? అసంభవము! శోకశాంతి పరమదయాసముద్రుని చింతనచేత చేకూరును—మన కనిష్టము ఘటించినదానికి ప్రతిశోధ అనిష్టాచరణుని ఇష్టసాధనమే.

(నీలాచలము వచ్చును)

నీలా—ఇతనిని చూడగానే ఏమేమో జ్ఞాపకము వస్తూన్నవి. ఇతని ముఖమున దివ్యతేజము ప్రతిఫలిస్తూన్నది! పద్మాననా!

పద్మా—ప్రభూ!

నీలా—నీ వెవడవో నిజము చెప్పు.

పద్మా—ఎన్నో సారులు మనవిచేసుకొన్నాను ప్రభూ!

నీలా—నాకు నమ్మకము కలుగలేదు. నీది వంగదేశ మంటావు—హిందువు నంటావు—అందునన్నా నిష్ఠాపరుడవైన బ్రాహ్మణుడ నంటావు—విధర్మినైన నన్నెందుకు కొల్చుతు న్నావు? ఇది వింత కాదా?

పద్మా—ఇందాశ్చర్య మేమున్నది? ముసల్మానుని కొలిచినంతమాత్రాన హిందువు తురక కానక్కరలేదు. విజాతీయుని సేవిస్తే జాతిపరివర్తన మావశ్యకమా! నా జాతీయత, నాధార్మికత, నా ఆచారవ్యవహారములు, నాహృద్భావములూ ఇవి నా జీవితమునకు ముఖ్యాధారములు......విశేషించి నేను ప్రేమదాసుడను, ఎక్కడ నాకు గౌరవాదరములు లభిస్తే అక్కడ సేవకావృత్తి జరుపుతాను.

నీలా—పద్మాననా! ఈ పెద్దపెద్దమాట లెక్కడ నేర్చినావు?

పద్మా—మీవంటివారితో మైత్రి చేసి అనుభవము వల్ల గ్రహించినాను. ఇవే నా పాలిటికి పరమధర్మములు, ఉత్కృష్టనీతులు.

నీలా—నీ కిచ్చటి ఆదరము నచ్చినదా?

పద్మా—చక్కగా నచ్చింది.

నీలా—అదెలాగు చెప్పగలవు?

పద్మా—ప్రభువులైన మీరీ సేవకునితో ఇంత చనువిచ్చి మాటలాడుతూన్నారిదే తార్కాణము.

నీలా—సరే—అలాగైతే నీవుకూడా నన్ను బాగా ఆదరించవలసి ఉంటుంది.

పద్మా—సందేహమా? నేను మిమ్ము పూజించవలసి ఉంటుంది!

నీలా—అలాగైతే నేను చెప్పినట్లు చేస్తావా?

పద్మా—ధర్మవిరుద్ధము కాకుంటే చేస్తాను.

నీలా—ఐతే నీవు నా కుపయోగించే నౌఖరు కావు.

పద్మా—నాకు సెల విప్పించండి అలాగైతే.

నీలా—సెలవా? నీకా?—అసంభవము.

పద్మా—అటులనా? నేను మీ కుపయుక్తుడ నని స్పష్టము. నాయెడల మీకు గాఢ స్నేహ మున్నట్లు మాట్లాడుతూన్నారు.

నీలా—నిశ్చయమే—కమనీయమైన నీ పద్మాననము, పద్మసౌరభభరితములైన నీ వచనములు అత్యంతమధుర మోహనములు—ఆ ధనము నన్నిదివరకే నీకు కింకరునిగా చేసినది—నా చిత్తము నీయందు లగ్నమయినది.

పద్మా—ప్రభూ! మీ నిర్వ్యాజకటాక్షముచేత నా జన్మ ధన్యమైనది.

నీలా—పద్మాననా! శ్రీజగన్నాథక్షేత్రమందు నా కొరకు నీ వెంత దుస్సహబాధ నొందినావో జ్ఞప్తియున్నదా? ఆనాడు ప్రాణత్యాగమునకు కూడా సంసిద్ధుడ వైనావు. అందుకు నా కృతజ్ఞత తెల్పుటకు నా అంతరంగమున నీయెడ స్నేహమూ ప్రేమా ఉదయించినవి—నిన్ను చూచినతోడనే పాషాణతుల్యమైన నా హృదయము అనిర్వాచ్యమైన మమతచేత ద్రవీభూత మైనది—నిన్ను చూడగానే నా చిత్తము నకు పరమానందము, నిస్తులసుఖము, నిశ్చలశాంతిన్ని కలుగును—పద్మాననా! ఇట్టి స్నేహము మమకారమున్నూ ఇం

కెవ్వరియెడనూ పుట్టలేదు—సరే కాని, నీ వింతకాలమునుండి నన్ను సేవిస్తూన్నావు—ఒకనాడైనా జీత మడుగలేదు, ఆ విషయమై ఎవ్వరితోనూ ప్రసంగించనైనా లేదు. నీ కెవ్వ రాత్మీయులు లేరా ?

పద్మా—నా కందరూ ఉన్నారు—ఈశ్వరానుగ్రహమున ఇంతవరకూ నా కే లోపమూ లేదు.

నీలా—అలాగైతే, నీ వత్యంతసుఖదాయకుడ వైన నౌఖరువు. ఇలాటివాడవుగనుకనే నాకింత సుఖము, ఇంత శాంతిన్నీ చేకూర్చినావు!...సరే—న న్నిలాగు సేవించినందుకు నీ కేదైనా పురస్కారము నేను చేయవలెను.

పద్మా—ఇప్పు డావిషయ మాలోచింప నక్కరలేదు. నా కేది కావలెనో దాని నడిగి పుచ్చుకొంటాను.

నీలా—సరే—అదీ మంచిమాట.

(సేవకుడు వచ్చును)

సేవ—ప్రభూ! దూత వచ్చినాడు—ఏదో జరుగురు పని ఉన్నదట.

(దూలియూ వచ్చును)

దూలి—ఏమి టా పని ?

నీలా—ఇదిగో నేను వెళ్ళి కనుక్కొంటాను. (సేవకునితో వెళ్లును)

పద్మా—అమ్మగారూ! నేను చెప్పినది జ్ఞప్తియున్నదా?

దూలి—న న్నలాగు పిలువవద్దని చెప్పలేదా? సోదరీ

అను. సోదరా! జ్ఞప్తి ఉన్నది. ఆవిషయమున కొంత ప్రయత్నము చేసినాను.

పద్మా—ఎట్టి మానవుడైనా స్వార్థపరుడు లోభీ అయినట్లయితే తనకార్యము సాధించుపట్ల మంచిచెడ్డలు నరకుచేయడు.

దూలి—అది నిజమే. ఈ విషయము నీ ఉపదేశము వల్ల వివరముగా ఎరుగగల్గినాను. నేను ముసల్మానునై ఇస్లాము మతము నవలంబించినా హిందూధర్మమును స్వధర్మముగా స్వీకరించినాను. నా ప్రాణేశ్వరుడు హిందూ ధర్మమన్న రోతపడినా నాకు దానియందు సానుభూతి ఉన్నది. హిందువు ముసల్మాన్, కాఫేరు యవనుడు ఈ పదములు భిన్నార్థములయందు వ్యవహరింపబడినా, నా దృష్టికి రెండూ సమానములే—జాతి ఒకటే వర్ణము ఒకటే, ధర్మము ఒకటే! వేర్వేరు పేర్లతో వెలసి ఉన్నది.

పద్మా—ఇట్టి సమభావము వారికి పుట్టినట్లయితే—

దూలి—సోదరా! నీకా భీతి వద్దు—భగవదనుగ్రహముచేత సర్వమూ చక్కపడవచ్చును—శ్రీజగన్నాథస్వామి తలుచుకొంటే అంతా సానుకూలమవుతుంది.

పద్మా—అలాగని మనము ప్రయత్నము మానరాదు.

దూలి—నిజమే— నా ప్రాణేశ్వరుడు హిందువు కదా! అట్టి మహానీయుడు స్వజాతీయులను ధ్వంసముచేయ కంకణము కట్టుకొన్నాడే! ఈవిషయమున తప్పు ఆ జాతీయులది కాదా!

పద్మా—అందుకు సందేహమా! తప్పు వాళ్లదే. అట్టి లోపములు సవరించుకొనవలసిన బాధ్యత మానవులదే.

దూలి—అది అవశ్యకర్తవ్యము... ఈమాట తలచుకొంటే నా సంగతి జ్ఞప్తికి వచ్చినది— నా కర్తవ్యము ప్రతిహింస—భ్రాతృపితృఘాతకుని రూపుమాపవలెను.

పద్మా—అదిగో—తిరిగీ అదే ప్రవృత్తి! రక్తపాతమునకు ప్రతిశోధ రక్తపాతమా! ఒకడు చెప్పు కొరికినాడని మనము సిద్ధె కొరకవచ్చునా? రక్తపాతము పాతకము—నీవది యొనర్చి పాప మార్జిస్తావా! పాపము ద్విగుణించదా! రక్తపాతము శాంతిని పోగొట్టును, నీవది యొనర్చి ఇప్పటి అశాంతిని రెట్టింతువా? ఇట్టి ప్రతిశోధ మానవులకు చెల్లదు. వారి స్వభావమున కది తగదు. తన్మూలమున చిత్తశాంతి నొందడము వట్టి భ్రమ—మహాభ్రమ.

దూలి—ఆ నరహంతకుడు నా తండ్రి రక్తము నా సోదరుని రక్తమున్నూ యథేచ్ఛము పానముచేసి నిశ్చింతుడై స్వేచ్ఛగా ఇష్టార్థసిద్ధి పొందడమే యోగ్యమా? వాళ్ళకు సన్నిహిత బాధువును శక్తివంతురాల నగు నేను వాడిని చూచి ఆనందించనా!

పద్మా—నీవు పొరబడుచున్నావు—పాపి ఎప్పటికి నిశ్చింతుడు కాజాలడు; అట్టిస్థితి మరణానంతరమే ఘటిల్లును. దోషులను దండించడము, పాపులను శిక్షించడమున్నూ మన పనులు కావు—పాపపుణ్యములు విచారించి యోగ్యమైన శిక్షా

పురస్కారములు విధించువాడు సర్వజ్ఞుడు యీసముద్రస్థిత భగవంతుడు. కావున మనకిష్ట మొసంగువారి శిక్షావిధాన మాయానకు విడిచిపెట్టి నిశ్చింతులమై కాలము పుచ్చుడము మనకు విధాయకము—మన దుఃఖమోచనము కూడా అతడే చేయగలడు. మనకు శాంతి కూర్చగలవాడాతడే—ఇట్టి దృఢ విశ్వాసము కలిగియుండడము మన కిహపరసుఖదాయకము.

దూలి—సోదరా! నీవచనములు నా అజ్ఞానాంధకారమును తొలగించినవి. మరీచికామయమైన ఈ మరుప్రదేశమున జలార్ణవరూపమున అవతరించిన నీ వెవడవు.

పద్మా—సోదరీ! అనుదినము నీతో గూడియున్న పద్మాననుడనే!

దూలి—అహా! దైవమా! నిజముగా నీవే దుఃఖత్రాతవు, నీవే శాంతిదాతవు.

(నీలాచలము వచ్చును)

నీలా—గొప్పశుభవార్త! ప్రాణేశ్వరీ!

దూలి—ఏమి టది?

నీలా—ముకుందదేవు వంగదేశముపై దండెత్తి వస్తూన్నాడు.

దూలి—ఇందు శుభ మేమున్నది?

నీలా—లేకేమి? ముకుందదేవు హిందూజాతికి మకుటమణి—హిందూధర్మమున కేకఛత్రాధిపతి—అట్టి హిందూకుల

తిలకుని రణరంగమున నిహతునిచేస్తే—అతనిని నా చంద్రహాస మున రెండు ముక్కలు చేస్తే నా ప్రతిశోధజ్వాల ఎంత చల్లారుతుంది !

దూలి—రాక్షసార్హమైన ఈ ప్రతిజ్ఞను విడువరా ? మీరు జ్ఞానులై యుండి ఈ విషయమున అజ్ఞానివలె వర్తిస్తా రేమి ?

పద్మా—పరమధార్మికులైన మీరు ధర్మజ్ఞానము పోగొట్టుకొంటారా ?

నీలా— పద్మాననా ! నీవుహిందువుడవు—అందుచేతనే ఇట్టి ధర్మజ్ఞానవచనము లాడుతున్నావు.

పద్మా—అట్టి పక్షపాతమే నాకుంటే నేను హిందు వునై హిందూద్రోహికి దాసత్వ మాచరిస్తానా ?

నీలా—(తేరి చూచును)

పద్మా —ప్రభూ ! హిందువు మీకంట పడితే—అతడు శిశువు కానీ- బాలుడు కానీ, వృద్ధుడు కానీ—అతనిని తక్ష ణమే వధిస్తానని కదా మీ గాఢ ప్రతిజ్ఞ ! అట్టి మీకు నా యెడ నింత అనుగ్రహ మెట్లు కలిగింది ?

నీలా—(తెల్లపోవును)

దూలి—ప్రాణేశ్వరా ! మీ శ్రీచరణములు పట్టి వేడుకొంటున్నాను ఈ దారుణ ప్రతిజ్ఞ విడిచిపెట్టండి.

పద్మా—ప్రభూ ! నేను కూడా అదే ప్రార్థన చేస్తూ న్నాను.

నీ—హృదయమా! మెత్తపడకు! (ప్రైకి) దూలియా, నీ వంతఃపురవాసినివి, పద్మాననా! నీవు నొకరుపు—మీరు అంతఃపుర విషయచర్చలలోనే తలదూర్చవలెను. నా ప్రతిజ్ఞ విషయమై నాకు బోధించు నధికారము మీకు లేదు. నే నిప్పుడు చాలావిషయము లాలోచించవలెను. (పోవును.)

దూలియా—(విచారగ్రస్తయై నిలబడును)

ప—సోదరీ, ఎందుకు చింతిస్తావు? పురుషుల దృష్టికి స్త్రీజాతి ఎంత చులకనగా నున్నదో కొంచె మాలోచించు. భార్యలకు ప్రాణేశ్వరులయెడ ఎట్టి చన వుండునో ఊహించు.

దూలి—సోదరా! న న్నిప్పు డేమి చేయుమన్నావు?

ప—ఉపయుక్తకార్య మున్నది. నీ పతిని పాపరాహువు గ్రసించకుండా కాపాడు—అతనిని చెడుదారినుండి మళ్లించు.

దూ—సోదరా! సతికి పతియే దైవము—అతడు పాపియైనా సతికి పూజ్యుడే. అందుచేత నాపతి ప్రతిజ్ఞకు విరుద్ధమైన కార్యము నేనెట్లు చేయుగలను?

ప—పత్నికర్తవ్యమును నీవు చులకన చేస్తున్నావు.

దూ—ఏలాగు? పత్నికర్తవ్యము భర్తను ప్రేమించడమే. అది నేను పూర్ణముగా నిర్వర్తించలేదా?

ప—ఏది? పతిప్రేమ ఇట్టిదా? సోదరీ! నీకే సహజమైన పతిప్రేమ ఉంటే నీపతి నేడీలాగు పాపగ్రాసాభిముఖుడై దృతగతిని పరుగెత్తునా? నీ కర్తవ్యము నీవు నిర్వర్తిస్తే నీపతి

యిప్పటివలె ఉన్మత్తుడై విపథగామి అవునా! పత్నీకర్తవ్య జ్ఞానమెట్టి దనుకొన్నావు? తమ తేజమును ప్రాణత్యాగమునకైనా వెనుదీయక సతి పతిని సన్మార్గవర్తనునిగా చేయవలెను. ప్రాణయోత్సాహినియై నిజసుఖశాంతులనైనా విసర్జించి పతి మనస్సునందు సుఖశాంతి ప్రతిష్ఠించవలెను.

దూతి—పద్మాననా! పద్మాననా! నీ వెవరవో ఛద్మవేషధారిణివైన మహాత్మురాలవు కావున తెలివిలేమిచేత పొరగప్పియున్న నా కళ్లు తెరచి నాకు పత్నీధర్మ ముపదేశించినావు; అజ్ఞానాంధకారముచేత నావరింపబడ్డ నా హృదయము కర్తవ్యాలోకముచేత వికసింపచేసినావు—ఇంకా నాకుపదేశించవలసినదాని నెరిగించు. రా.

---

## నాలుగో దృశ్యము

శిబిరము.

ముకు—నా ఉత్కళసైన్య మింతవరకూ రాలే దేమి? ఇక వాళ్లు వచ్చే ఆశ లేదు. నీలాచల మేకుణాము పైబడునో అనే భయము పీడిస్తూన్నది (లోపల ఉత్కళసైనికుల ఆర్తనాదము) ఏమి టీ మొరలు! శ్రీజగన్నాథస్వామిదే భారము.

(నీలాచలము వచ్చును)

నీలా—జగన్నాథస్వామిదే భారము. హిందూకుల తిలకా! ముకుందదేవమహారాజా! మీరు నేడు మా

కైదీలు. మీ రక్తముతో నేను స్వయముగా తర్పణము చేసి నా ప్రతిహింసావహ్నిని కొంత చల్లార్చుతాను.

ముకు—అయ్యా! నీ వెవడవు—మనుష్యుడవా, రాక్షసుడవా?

నీలా—నేను రాక్షసుడను. నీలాచలమనే రక్కసుని ఎరుగరా మీరు?

ముకు—మీరా నీలాచల సేనాధిపతులు?

నీలా—మీరు హిందువులే, నీలాచలమును పోల్చుకో లేకపోయినారా! హాహాహా!

ముకు—సైన్యాధిపా! ఏమిటీ వికృతవేషము?

నీలా—ఇదా? అంతకుని వేషము—ఇది నా సహజ వేషమా? లేక మీ హిందూసోదరులు నన్నీ వేషము ధరింప చేసినారా?

ముకు—మీ మాట నాకు బోధపడలేదు.

నీలా—బోధపడినా, బోధపడకపోయినా జరుగవలసి నది జరిగితీరవలెను. రక్తపాతము—రక్తస్రావము—హిందువుల రక్తము ఏరులై పారవలెను.

ముకు—ఈ భీషణప్రవృత్తికి హేతువేమి? వీరా గ్రేసరా! నీ మొగము విజాతీయులయందలి ఘృణచేత ఎర్రవారినదేమి? నీ కన్ను లేదో పైశాచికప్రవృత్తిచే నిప్పులు కురుస్తున్న వేమి? నీ శరీర మాపాదమస్తకమూ

ఏదో అప్రాకృతమయిన స్పందనముచేత కంపిస్తూన్న దేమి! ధైర్యశాలివే, నీ కిది తగదు, కోప ముపసంహారించుకో.

నీలా—ఉపసంహారించుకోనా కోపము? నీ రక్తము పానము చేస్తేనే గాని నా కోపాగ్ని చల్లారదు; హిందూ జాతి ధ్వంసము కావలెను, హిందూధర్మము మూలోత్పాటనము కావలెను. అప్పుడు నా కోపోపసంహార మవును.

ముకు—అయ్యో! నీవు విధర్మివా లేక కేవల చండాలుడవా?

నీలా—చండాలుడనే అవుదును గాక! నే నే జాతిలో పుట్టినానో దానియెడ చండాలుడనే—మొదట నే నే ధర్మము ప్రతిపాలించినానో దానియెడ ఇప్పుడు పాషండుడనే—ఏపుణ్యక్షేత్రమున నా దేహము మనస్సున్నూ పవిత్రములైనవో దానియెడ నేను చండాలుడనే!

ముకు—(తనలో) మానవు డొకమతమును త్యజిస్తే ఇట్టి చండాలు డగునా?

నీలా—మహారాజా! ఆలస్యము చేసినందువల్ల లాభము లేదు. నీప్రాణము లర్పించ సంసిద్ధుడవై యుండుము. హిందూరక్తపిపాస నన్నుక్షణమూ వేధిస్తూన్నది.

ముకు—సేనాధిపా! నేను దుర్బల శిశువు నను కొంటివా? లేక పిరికివాడనని తలచినావా? కాపురుషుడనని ఎంచినావా?

నీలా—మహారాజా! నీవు వీరుడవు, సాహసివి—బలము గలవాడవు తరుణ వయస్కుడ వని ఎరుగుదును కాని—

ముకు—ఇం కేమి?

నీలా—ఉపాయ హీనుడవు.

ముకు—నే నుపాయహీనుడనా?

నీలా—ఈ విషయము నా కొక్కనికే తెలుసును.

ముకు.—అది పొరపాటు—చేత నొకకత్తి ఉంటే వేయి శత్రువుల ఎదుట నిర్భయముగా నిలువగలను.

నీలా—అస్త్రసహాయ ముంటే కదా?

ముకు—ఎవ రక్కడ?

(కతలు మొగలసైనికులతో వచ్చుదు)

కత—మహారాజా! నేను.

ముకు—కతలూ! ఓహో! ఇది మొగలసైన్యమూ!

(తెరలో మహారాజా! విశ్వాసఘాత! దూరము తొలగండి.)

ముకు—ఏమిటీ కేకలు! నాసైనికుల కేకలవలెనున్నవి!

(తెరలో—అయ్యో! ప్రాణము పోతూన్నది!)

ముకు—సైనికులారా! భయపడకండి, ఇదే, వస్తున్నాను.

కతలు—(కత్తి తీసి) మహారాజా! ఎటు పో గలవు?

నీలా—మహారాజా! ఎదీ నీ కత్తి? నీ ఉత్కల సైన్య మేది? మొగల సైన్య మెవరికింద నున్నది? ఎందుకీ దంభము? కతెలూ, నీ పని కానీ—(కతలు ముకుంద దేవుని కైదు చేయ గమకించును.)

ముకు—జాగ్రత్త! గుంటనక్క మృగరాజు నంట సాహసించునా?

నీలా—ముకుంద దేవా! మృగరాజు నేడు శృగాలము చేతిలో చిక్కింది. ఎంత లజ్జాకరము! ఎంత అవమాన జనకము!

ముకు—(తనలో) నాకు మతి పోతూన్నది. సింహాము నిరుపాయమైతే శృగాలము కూడా అవమానించవచ్చును.

నీలా—కతలూ! ఊరకున్నా వేమి? నీ పని నీవు చేయవచ్చును.

కత—(సంకెలలు తీసి) మహారాజా! ఇప్పుడు సింహామెవరో, శృగాల మెవరో సెలవివ్వండి.

ముకు—తల వ్రాత నెవ్వరు తప్పించగలను?

నీలా—కతలూఖాన్—మహారాజుని చెరలో నుంచు—ఇంకొక మాట, నాయాజ్ఞ లేనిదే ఎవరున్నా ఈయనతో మాటలాడగూడదు జాగ్రత్త!

కతలు—చిత్తము మహాప్రభూ! మహారాజాగారూ నడవండి.

ముకు—మొగల్ సైనికులారా! ఇదా మీ రాజభక్తి! ఇదా మీ మానుషత్వము! పాదుషావారి అన్నము తిని, వారి రక్షణములో నుండి, తగిన సమయమున ఎదురు తిరిగి వారితో యుద్ధము చేస్తారా? పోషించినవానికి ప్రతికూలముగా పోవుతున్నారా!

నీలా—త్వరగా తీసుకొని పొండి.

ముకు—మొగలవీరులారా! ద్రోహము చేస్తారా? మీరు పవిత్రమైన మొగలకులమునకు చెందినవారై, ఇస్లాము మతావలంబులైన శూరులై ఉండే, విశ్వాసఘాతక విడిచిపెట్టండి! ఈ నీచాచరణము మాని మీకు కూడుగుడ్డఇచ్చి పెంచిన పాదుషావారి పక్ష మవలంబించండి. చెల్లునీడను శ్రాంతి తీర్చుకొని దానికొమ్మ నరికే కృతఘ్నులు కాకండి.

నీలా—తీసుకొని పోరేమి? (కతలు బలాత్కారముగా తీసుకొని పోవుదు). మొగలసైనికులారా! మీరు ధర్మద్రోహులా? మీరు కాఫిరులా మొకుంద దేవుమాట వినడానికి? నీచుడైన పాషండుని ఉద్దేశ మేమి? పరమపవిత్రమైన ఇస్లాము మతస్థులగు మిమ్ము అపవిత్రుడైన కాఫిరు అధీనమున ఉంచడము మీమతము చెడగొట్టి మిమ్ము హిందువులను చేయుటమే.

మొగలులు—అల్లా! ఈ అధమున కింత ధైర్యమా!

నీలా—సోదరులారా! అక్బరుపాదుషాగారితో నాకు వైరము లేదు. అది సులేమాన్ మరణముతోనే అంతరించింది.

అక్బరుపాదుషా మీ కెట్టి ప్రభువో నాకూ అట్టి ప్రభువే—జే అక్బర్ పాదుషాకు జే!

మొగలులు—అక్బర్ పాదుషాకు జే! సోదరులారా! మన సంగరమూ కలిసి అల్లాహూ అక్బరని రోదసీకుహరము నిండేలాగు అట్టహాసముచేసి కాఫిర్లగు హిందువుల జాతిని ధర్మమును ధ్వంసము చేయవలెనని దృఢప్రతిజ్ఞుల మవుదాము. అందుకు తగిన పరికరములను జాగ్రత్త చేతాము—కాఫిర్లు నామావశేషులయ్యే ప్రయత్నములు చేతాము.

మొ॥ సై॥—మీ రాన నిర్వ్యక మే శడవు, మే సంగరమూ సిద్ధముగా నున్నాము.

నీలా—సరే—ప్రస్తుతము మీ రందరూ సుఖముగా కాలము గడపండి.

మొగ—ఆహా! ఏమి సుదినము! ఏమి సంతోషము! ఏదీ సారా! (పోదురు).

నీలా—నేను హిందూ రాజు నా కైది. హిందూ ధర్మానికి ప్రాపకుడు నా చేతిలో చిక్కినాడు. రేపు హిందూరక్తము రణరంగమున ప్రవహిస్తుంది. నా ప్రతిజ్ఞ నెరవేరడాని కిదే మొదలు—ఇప్పుడు విశ్రాంతి తీస్కొంటాను.

(పద్మానసుడు వచ్చును).

పద్మా—మీకు విశ్రాంతి చేకూరుతుందా ప్రభూ?

నీలా—ఏమి? చేకూరదా? నీవంటి సేవకుడు పరిచర్య చేస్తూంటే విశ్రాంతి చేకూరదని వారెవరు?

పద్మా—హృదయ మందలి క్లేశము శ్రాంతిని పోగొట్ట గలదా ?

నీలా—పద్మమును పోలిన నీ ముఖము చూస్తూ, మకరందమును బోలు నీమాటలు వింటూ ఉంటే సకలచింతలూ నమసిపోవును, శోక మంతా శూన్యమవును.

పద్మా—పద్మము పూర్తిగా వికసించినప్పుడు కదా మీరు చెప్పినది జరుగును.

నీలా—నావద్దనున్న పద్మము చాలాకాలముకిందటనే వికసించినది, కాని నే డది వన్నె తొరగి ఉన్నది—కారణ మేమి ?

పద్మా—పురుగు ముట్టినది.

నీలా—పురుగా ? ఏదీ పురుగు ?

పద్మా—ప్రభూ! అంతా మీరే చేసి కారణము నన్నడుగు తూన్నారేమి ?

నీలా—నేనా ? పద్మాననా ! హాస్యము చేయకు.

పద్మా—నే డెవరిని చీకటి కోణములో పెట్టినారు ? రే పెవరిని దుర్గణముపాలు చేయ నున్నారు ? ఎవరికొరకు హిందువులెల్ల హాహా రవము చేస్తూన్నారు చెప్పండి ?

నీలా—(నవ్వి) హిందూరాజు ముకుందదేవుని చెరలో నుంచినాను.

పద్మా—ఎంత సులువుగా అన్నా రా మాట ? మీ మనస్సులో ఎట్టి సంకోచమూ కలుగలేదా? హిందూప్రాణ

సర్వస్వమును ఎంత దుర్భరణము పాలు చేయదలచినారు! ఆజాతి హాహాకారవము నెంత ఆనందముతో వింటున్నారు! ప్రభూ! ప్రభూ?

నీలా—ఇన్నాళ్లు మాతో సహవాసము చేసినా నీ హిందూభావమును విడువకున్నావుగా పద్మాననా?

పద్మా—ప్రభూ! మేఘావృతుడైనా సూర్యుడు తన సహజతీవ్రకాంతి విడువడు. రాహుగ్రస్తుడైనా శీతకరుడు తన చల్లదనము కోలుపోవడు.

నీలా—అలాగైతే బాలకా! హిందూరాజు చెరలో పడినందుకున్నారే పతని మరణము నిర్ధారిత మయినదాని కిన్నీ హిందూమత ముత్పాటన మవుతుం దనిన్నీ, నీ యిష్టము వచ్చినట్లు ఏడువవచ్చును, కన్నీ రోడ్చవచ్చును. నీ వేమి చేసినా ఈ మూడూ తప్పవు.

పద్మా—ప్రభూ! ప్రభూ!

నీలా—హిందూరాజ్యము ధ్వంసము చేయకమానను. హిందూజాతి నాశనము చేసి తీరుతాను. హిందూమతమును మట్టిలో కలిపితీరుతాను. ఇది నా కర్తవ్యము! నా దృఢప్రతిజ్ఞ!

పద్మా—అలాగైతే నాకర్తవ్యమునిర్వర్తింప నాకనుజ్ఞ దయచేయండి.

నీలా—ఏమి టది?

పద్మా—నాకు కర్తవ్యము లేకేమి? హిందువును కదా నేనిప్పుడు చేయదగిన పని లేదా? హిందూమత

ద్వేషి హిందువులను సర్వనాశనము చేయజూస్తూన్నప్పుడు నేను హిందువునై చేతులు నలుపుకొంటూ కూర్చుంటానా? మా జాతి సమూలము ధ్వంసము కానున్న సమయమందు నేను నిశ్చింతుడనై సహించియుంటానా?—అసంభవము! అసంగతము!

నీలా—(నవ్వి) బాలకా! నీ శిశుచాపల్యము నిన్నింకా విడువలేదా? ఏమైనా, నీ ధర్మమందు నీ కింత అభినివేశ మున్నందుకు నాకు చాలా సంతోషము.

పద్మా—(తనలో) నేను గొప్ప పొరపాటు చేసినాను. ఉత్తేజితుడనై నా మనోనిశ్చయము పూర్తిగా ప్రకటించినాను. (పైకి) ప్రభూ! నా దిట్టతనము మన్నించండి.

నీలా—నేను మన్నించడానికి నీ వేమి తప్పు చేసినావు? నీ నేరమేమీ లేదే.

పద్మా—ప్రభూ! ప్రభూ! అలాగైతే—

నీలా—చెప్పు. నీవు చెప్పదలచినది సంకోచములేక చెప్పు. భయపడకు.

పద్మా—రేపు హిందూరాజు పరలోకముకు పోవును, హిందూజాతి సర్వనాశమగును కదా?

నీలా—అవును. అది తప్పదు.

పద్మా—అట్టి ప్రళయము రాకపూర్వము సజీవులైన మా మహారాజుగారి నొకసారి దర్శించవలెనని నా కోరిక. దీనిని తీర్చుతారా?

నీలా—అలాగే. వధ్యభూమిని రేపు నీవాతనిని చూడ వచ్చును, దాని కేమి ?

పద్మా—కాదు. తత్పూర్వ మాయనను దర్శించి నేను కొంత ధర్మోపదేశము నొందవలెనని ఉన్నది.

నీలా—నీకు ధర్మానురక్తి గాఢముగా నున్నట్లుంది. (తనలో) నాకు కూడా కొంతకాల మాలాగే ఉండెను. (పైకి) మూఢవిశ్వాసము! సరే. ఎప్పుడు చూడవలెనని ఉన్నది నీకు ?

పద్మా—నేటిరాత్రి చెరసాలలో ఆయన నొంటిగా దర్శించుకొంటాను.

నీలా—వీలు లేదు—ఖైదీతో ఒంటిగా మాటలాడు తావా !—అదీ రాత్రివేళనా ? ఇది రాజనీతి విరుద్ధము. నీ కోరిక తీర్చకూడనిది.

పద్మా—ప్రభూ! ప్రభూ! మి మ్మింతకాలము ఉచితముగా సేవించినందుకు నేను కోరే ప్రతిఫల మీా కోరిక తీర్చడమే. ఇదనుగ్రహించడమే నాకు పదివేలు.

నీలా—అనుగ్రహ మేమి ? దీనికి నీకు హక్కున్నది. తెలివిమాలిన కోరిక! ఇది నీ సేవకు తగిన పురస్కారమా! ఇదిగో నా పేరు చెక్కిన నీ లుంగరము! దీనిని చెరసాలలో చూపి నీ ముచ్చట తీర్చుకో.

పద్మా—జే! నీలాచలప్రభువుకి జే! (పోవును)

---

## ఐదో దృశ్యము

చెరసాల.

ముకు—యామినీ దేవీ! నీవు పోవచ్చును—ఎంత భాగ్యవతివి! నిష్కళంకభావమున నాయొద్ద సెలవుపుచ్చుకొంటున్నావు! ఉషాదేవీ! నీవు రా! సిగ్గెందుకు? నీవు నిర్మలపూతచరితవని నే నెరుగుదును,... కాని ఏమి చేయగలను? నేడు అధర్మాధికారము చెల్లుబడి పోతూన్నది. అన్యాయదేవత నేడు పాలిస్తూన్నది. నీ వేడుస్తూన్నా వేమి—వృథాశ్రుపాత మేల? ఇది చూసి నీలాచలము నాపై దయచూపునని కాబోలు నీ అభిప్రాయము? విశ్వాసఘాతకుని కృపాణము విరిగిపోవునా? నా రక్తప్రవాహము నరికట్టగలవా? అసాధ్యము... శ్రీజగన్నాధస్వామీ! బోనులో పెట్టిన గొర్రెపిల్లలాగు—యూపస్తంభమునకు కట్టిన మేకపోతు రీతిని నన్ను బలివేస్తావా? వీరునకు తగినమరణమా ఇది? భీరునివలె శత్రువుని ఖడ్గమునకు మెడ వంచవలెనా?—అబ్బా! క్షత్రియున కింతకన్న నెక్కువ యాతన ఉన్నదా? వీరున కింతకన్న నీచ మరణ మున్నదా?

(పద్మానను కత్తితో వచ్చును.)

ప—లేదు, లేదు—ఇది సర్వనికృష్టమైన మరణము—మీకు తగినది కాదు.

ముకు—బాలకా! ఎవడవు నీవు?

ప—ధర్మరాజా! నేనొక హతభాగ్యుడనైన హిందువును.

ముకు—ఈ ముసల్మాను సేవకుల మధ్యనా నీ వాసము?

ప—ఔను—మహాప్రభూ!

ముకు—హిందువు నంటివి—నన్ను పరిహాసించడము నకా నీ రాక?

ప—కాదు కాదు మహాప్రభూ! నన్ను నమ్మండి.

ముకు—నిన్ను నమ్మనా? చేతిలో కత్తి, అర్థరాత్రి వేళ రావడము, కైదితో ఒంటిగా సంభాషణ—నిన్నెలాగు నమ్మడము? రహస్యముగా నన్ను వధించుమని ఎవరో ప్రేరేపించియుందురు నిన్ను.

పద్మా—రామ! రామ! రహస్యముగా మిమ్ము తప్పించడానికి వచ్చినాను.

ముకు—గుప్తరక్షణా?

పద్మా—ధర్మరాజా! నన్ను నమ్మండి.

ముకు—ఏలాగు నమ్మగలను? నా తాబేదారులను నమ్మడముచేతనే నాకీ నికృష్టపు గతి సంభవించినది. అలాగే నిన్ను నమ్ము మంటావా? నీవు కుర్రవాడవు. శత్రువునకు దాసుడవై వాని అన్నము తింటూన్న నిన్నెలాగు నమ్మగలను? అసంభవము!

పద్మా—(నమస్కరించి శిరము వంచి) మహాప్రభూ! నన్ను విశ్వసనీయుదాసునిగా నమ్మండి.

ముకు—(తనలో) ఇతడు నిష్కపటి లా గున్నాడు. (ప్రైకి) సరే—బాలకా, లే—నన్ను రహస్యముగా రక్షించుమని నీకు బోధించిన ఉదారు డెవరో చెప్పు—నన్ను కష్టపుస్థితి నుంచి ఉద్ధరించ నెంచిన మహనీయు డెవరో చెప్పు.

ప—ఏ యుదారుడు ఉచ్చము నీచము, పెద్ద చిన్న అను వివక్షత లేక సర్వజీవరాశిని సమదృష్టిని లాలనపాలనములు చేస్తూన్నాడో, ఏ దయానిధి ఆకాశమున గ్రహనక్షత్రములకు, అవనీతలమున అనంతజీవరాశికి భరణపోషణములమరుస్తూన్నాడో ఆ మహనీయుడే మిమ్ము రక్షణచేయుమని నన్ను ప్రేరేపించినాడు.

ముకు—బాలకా! నిన్ను నమ్ముతాను—నీవు సామాన్యుడవు కావు, దేవదూతవు; దీనులనుద్ధరించ ప్రేరేపింపబడినావు. ఓ ఉదారహృదయా! కృపానిధే! భక్తవత్సలా! నీపాదపద్మముల కివే సహస్ర వందనములు! బాలకా, నీవుకూడా నాకు వంద్యుడవే! (నమస్కరించును.)

పద్మా—మహాప్రభూ! నన్ను క్షమించండి—అకించనుడనైన నేను నా కర్తవ్యము నెరవేరుస్తూన్నాను, కావున నన్ను పెద్దచేయకండి. సర్వజన సామాన్య కార్యమునే ఒనర్చినాను కాని అతిమానుషమేమీ నిర్వహించలేదు.

ముకు—బాలకా! నీవు ధన్యుడవు—కాని సుక్షత్రియుడను, వీరుడను ఐన నాకు దొంగవలె పారిపోవడము భావ్యమా?

పద్మా—భావ్య మెన్నటికీ కాదు.

ముకు—నీ వుపదేశించిన తీరదే కాదా?

పద్మా—(కత్తి ముకుందదేవుని ముందుంచి) మహాప్రభూ! మొదట నిరస్త్రులౌటచేత కదా మీరిట్టి దుస్థితిపాలైనారు. ఇదే శస్త్రము—దీనిని యథాయోగ్యముగా ఉపయోగించండి.

ముకు—నీవు వీరుడవు. కావుననే వీరుని మనోభావమెరిగి అతనికిగల గొప్పలోటు తీర్చినావు. (శస్త్రమును పట్టుకొని) ఇదే వీరుని ముఖ్యాలంబనము, ప్రధాన శక్తి! (ముద్దు పెటుకొనును.)

పద్మా—నియమితకాల మాసన్న మౌతూన్నది—కావలివాళ్ల అడుగులచప్పుడు వినబడుతూన్నది. (పద్మాననుడు పోవును)

(ఇద్దరు కావలివాళ్లు వత్తురు.)

1 కావ—ఏమిది? ఖైది పారిపోయినాడు—కత్తి ఉంది—పరుగెత్తి పట్టుకోండి.

ముకు—ఓయీ, భయపడకండి—ఖైది విడుదలయినాడు నిజమే, కాని పారిపోయేవాడు కాదు.

2 కావ—నిల్చుండి చూస్తా రేమి? పరుగెత్తండి—కత్తితో నరకండి, పట్టుకోండి.

ముకు—నా కంఠమున ప్రాణమున్నంతకాలము నన్ను ఎవరూపట్టుకోలేరు.

(యుద్ధముయి కావలివాళ్లు పారిపోదురు).

ఇక నామార్గము నిరాటంకమైనది.

(నీలాచలము వచ్చును).

నీలా—అయ్యో! నీలాచలము వచ్చెనే—నీ యత్నము విఫలము! నీ ఆశ భంగమయ్యెను.

ముకు—కాదు కాదు—నాయత్నము సఫలము—నీలాచలమును దాటిపోయేతరుణము ప్రాప్తించింది.

నీలా—అబ్బా! అంత గర్వమా?

(యుద్ధమవుతూండగా కతలు స్వసైన్యుడై నీలాచలముకు సాయపడును; ముకుంద దేవుని కత్తి విరిగిపోవును).

ముకు—శ్రీజగన్నాధస్వామీ నీదే భారము! నాకేమి గతి కల్పించినావు?

(పద్మానుడు కత్తితో వచ్చును).

పద్మా—దైవము తన్ను నమ్మినవారిని దరిజేర్పక మానడు—ఇదిగో కత్తి (ఇచ్చును).

నీలా—ఏమిది! పద్మానుడా! విశ్వాసఘాతకా!

ముకు—రంతుల కేమి రణమిమ్ము! సేనాధిపా

(తిరిగీ యుద్ధములో అందరిని తప్పించుకొని ముకుంద దేవు పారిపోవును).

పద్మా—భగవంతుని కృపవల్ల ముకుంద దేవు భద్రముగా నున్నాడు.

నీలా—తరుముండి—వెంటాడి పట్టుకోండి. (కొందరు పోవుదురు) ఏమిదింత! మా అందరికళ్లలో దుమ్ముజల్లి ముకుంద దేవు దాటిపోయినాడు!

కత—ఇంతా ఈ బాలకుడే చేసినాడు.

పద్మా—నీవు యువకుడవే! అతని నాపలేక పోయి నావా? అశక్తతకు దుర్జనత్వముతో డగును! మూర్ఖా! చేతగాక చెట్టనాపైని వేస్తున్నావా?

నీలా—(కోపముతో) నరాధమా! విశ్వాసఘాతకా! నిన్ను చేరనిచ్చినందు కిదా ప్రతిఫలము? నీతో చేసిన చెలిమి కిదా ప్రతిక్రియ?

పద్మా—సేవకుడు సేవాధర్మ మొనర్చెను మహాప్రభూ!

నీలా—నీ ప్రభువు నెడ విశ్వాసఘాత ఒనర్తువా?

పద్మా—ప్రభుధర్మరతుణ మొనర్చినాను.

నీలా—హిందువుప్రాణనాశమే నా ధర్మము.

పద్మా—అది అధర్మము, ప్రభూ!

నీలా—నీ కలాగు తోచవచ్చును.

పద్మా—సమస్తజీవరాశి కట్లే తోచును.

నీలా—నా కలాగు కాదు.

పద్మా—మీరు ఈలోకములోనివారు కారా?

నీలా—లాభము లేదు నీతోచర్చించి.

పద్మా—హిందూరక్తపాతమువల్ల లాభ మేమి?

నీలా—నీతో క్రొత్తవాదము సల్పుటకన్నలాభమే. ఎవరక్కడ! ఈవిశ్వాసఘాతకుని చెరలో నుంచండి. నా చేతితో మొదట వీని వధియించి నా ప్రతిజ్ఞాపాలనకు భూమిక చేస్తాను.

కత—ఇప్పుడు వీ డేమి చేయగలడో చూస్తాను (పట్టుకో పోవును).

పద్మా—జాగ్రత్త! విశ్వాసఘాతకా! కుక్కా! ఇతరు లెవ్వ రక్కరలేదు. ఈ సేవకుడు అతిసంతోషముతో యజమానిగారి యాజ్ఞాపాలన చేయగలడు—కత్తి నివ్వండి ప్రభూ!

నీలా—(తనలో) హృదయమా! మెత్తపడుతావేమి? కాఠిన్యము వహించు. దయాదాక్షిణ్యములారా! మీరందరూ విశ్వాసఘాతకులు—మీతో నా కే సంబంధము ఇక వద్దు—ఇప్పుడే మీరు పోవచ్చును—హింసా! ద్వేషమా! మీరు వచ్చి నాహృదయమున ప్రవేశించండి—నేను హిందువులను, వారి రాజ్యమును, వారి ధర్మమును మీకు బలిగా నొసంగెదను—(పైకి) విశ్వాసఘాతకా? సిద్ధముగా నుండు (కత్తి పట్టుకొనును).

పద్మా—ఇదిగో సిద్ధపడుతూన్నాను ప్రభూ! (మొక్కరించి) శ్రీజగన్నాథా! ప్రభువుగారికి మే లొనగూర్చు! ఈ దీనుని నీదరి జేర్చు!

నీలా—ఏమి ఈబాలుని స్థైర్యము (కత్తి నెత్తబోయి దించి) ఏమిది! నాచేయి లేవకున్నది! నా ఒళ్లంతా వణకుతూన్నది! హృదయము కంపిస్తూన్నది—భూమ్యాకాశములు, చరాచరసృష్టిన్నీ కంపిస్తూన్నవి! ఏమి నా కీ దౌర్బల్యము? నీలాచలముకు కంపనమా! సామాన్యబాలకునిపై నా కింత మమత ఎందుకు? సేవకునియెడ ఇంత ఆకర్షణ మేమి? అసంభవము! ఇంత కోమలత్వము కూడదు—ఏదీ కత్తి! (కతలు కత్తి నిచ్చును) నాకు కావలసినది హిందూరక్తపాతము! హిందూధ్వంసము! హిందూమత వినాశము! (కత్తినెత్తును)

పద్మా—చివరచూపు తనివితీరా చూడనీయండి ప్రభూ!

నీలా—(పద్మానుని మొగము చూచి నివ్వెరపడి నిలుచును—కత్తి చేతినుండి జారును)

# నీలాచలము

## నాల్గో అంకము

### మొదటి దృశ్యము

శిబిరము—ముకుందదేవు, సైనికులు

ముకు—సైనికులారా, నాకు శక్తి వచ్చినది. తిరిగి యుద్ధము చేస్తాను.

సైని—మహాప్రభూ! తొందర పడకండి.

ముకు—తొందర వద్దా? తొందరవద్దా! కార్యము మించిపోయేటప్పుడు ఆలస్యము కూడునా? క్షత్రియుడనై నేను వెనుతీయవచ్చునా?

సైని—శిఖి మనాయి మహాపాత్రోలు చక్కగా పోరు నడుపుతూన్నారు.

ముకు—వారిద్దరి పైని యుద్ధభారము వేసి నేను నిశ్చింతుడనై ఉందునా? కర్తవ్యభారనిర్వహణనిపుణులు కాని ఆవీరమ్మన్యులను నమ్మి నేనూరకుందునా? అయ్యో సరియైన వేళకు

వాళ్లు వచ్చిఉంటే నాకీ ఆయాస ముండకపోవును. ఈగాయములు తగులక పోవును. నా సైన్యము నష్టముకాక అనాయాసముగా శత్రువుల నోడించి యుండును, విజయలక్ష్మి నన్ను వరించియుండును. ఇప్పుడు నన్ను మీ రాటంకపెట్టవద్దు—ఇక నేను ఆలసించను. (తెరలో ధ్వని) ఏదీ కత్తి! ఏమిటీ కోలాహాలము? (సైనికుని చేతినుండి కత్తి లాగుకొనును) శ్రీజగన్నాథస్వామికి జే! తెరలో శ్రీజగన్నాథస్వామికి జే! నీలాచల నివాసునికి జే!

ముకు—ఏమిది? మా సైనికుల కంఠధ్వనిలా గున్నది. వీళ్లు జయించినారా? లేక ఓడి పోయినారా? (శిఖి మనాయీలు సైన్యముతో వత్తురు)

శిఖి—జయము మనదే మహాప్రభూ! అదిగో చిత్తగించండి శత్రువులు శ్వేతపతాకధారులై శాంతిభిక్ష యాచించడానికి మన శిబిరమునకు వస్తూన్నారు.

మనా—మహాప్రభూ! శత్రుసేనాని తలవంచుకొని మెల్లగా నడుస్తూ సంధి కొడబడి ప్రభువువారి చరణసన్నిధి చేరుతూన్నాడు.

ముకు—వింతగా నుంది! నీలాచల మెంత వేగము పరాజితుడైనాడు! మిత్రులారా! మీరు ధన్యులు. సైనికులారా! మీరు ధన్యులు. మీపరాక్రమము చేతనే నేడు నాకింత గౌరవము కలిగింది, నేడీ విజయము ప్రాప్తించింది.

(నీలాచలము వచ్చును)

నీలా—మహారాజా! అభివాదనము!

ముకు—సేనానీ! అభివాదనము రమ్ము కూర్చుండుము.

నీలా—మహారాజా! మీరు ధన్యులు! మీ బలము, మీ చలము, మీ వీర్యము, మీ యుద్ధకళాకౌశలము అతి ప్రశంసనీయములు! ఈభరతవర్షమున మీబోటి వీరులు చాలా అరుదు. మీవలె శరీరమూ ప్రాణమూ తృణములని యెంచి అగణ్యసేనావాహిని కెదురునిల్చి నిస్సహాయముగా పోరగల్గిన శూరులేరీ? మహాశక్తిశాలియైన అక్బరుపాదుషా వారే మీచేత పరాజితులైనప్పుడు మాబోట్లు ఒక లెక్కా ఇదంతా నేను స్వానుభవముచేత గ్రహించినది కాని వినికిచేత కాదు.

ముకు—వీరాగ్రేసరా! అకించనుడనైన నన్నింత గొప్పచేస్తున్నారు కాని, మీ రిప్పుడు చేసిన స్తుతి మీకు తగిఉన్నది — మీబోటి వీరశిఖామణి భారతవర్షమందే కాదు పృథ్వియందే కానరా డన్నమాట అత్యుక్తి కాదు, పొగడ్త కాదు. అందుచేతనే ఈ విద్రోహ మణచుటకు నన్ను నియోగించి ఊరకుండక నా సాయము కొరకు మొగలసేనతో కతలుఖాన్‌ను పంపినారు. దీనిబట్టి మీరు నాకన్న గొప్పవారని తేటతెల్ల మవుతూన్నది కాదా!

శిఖ—అప్రతిమప్రతాపు లిద్దరు నేడు కూడినారు.

అనర్ఘవలయమునకు అమూల్యరత్నము దాపయింది. ఇది చూసిన మేము ధన్యులము!

సైని—ముకుంద దేవు మహారాజుగారికి జే! నీలాచల సేనాధిపునికి జే!

ముకు—జే ఢిల్లీశ్వరునికి జే! అక్బరు పాదుషాగారికి జే!

నీలా—ముకుంద దేవమహారాజా! మిత్రభావమున నా ఆతిథ్యము గ్రహించండి.

ముకు—సంధిషరతులు నిర్ధారణచేసి పాదుషావారికి పంపివేతాము. అంతకుముందు విశ్వాసఘాతకుడయిన కతలును నా అధీనము చేయవలెను. సంధినియమములు వినకపూర్వము ఈ నరాధముని పాదుషావారి ఎదుట నిలువబెట్టవలెను, వారు సంతసిస్తారు.

శిఖి—కతలు పరలోకప్రాప్తుడైనాడు.

ముకు—నిజమే? అట్లయిన అతని తల ఏదీ?

శిఖి—అతని శవము మాయమైనది.

ముకు—విచిత్రముగా నున్నదే—(తనలో) ఈమాట సంశయాస్పదము.

శిఖి—నేను వెతకించినాను—విశ్వాస్యులైన అతని అనుచరులు తమ ప్రభువు శిరస్సు ఖండింపబడి ఏమి అవమానము పాలవునో అనేభయముచేత ఆ శవము నెక్కడనో రహస్యముగా పూడ్చిఉంటారు.

ముకు—(తనలో) ఇది నేను నమ్మను. నేను వెతకించిన తరువాత గాని నిజము తెలియదు—వాడిమనోవృత్తి పరమ నీచము; వానికి ప్రాణమం దతిప్రీతి. సాధారణముగా చచ్చే వాడుకాడు.

(డిల్లీనుంచి దూత వచ్చును.)

దూత—జే! ముకుందదేవు మహారాజుగారికి జే!

ముకు—దూతా! డిల్లీవార్తలేమి? శిబిరముకు రమ్ము. శిఖమనాయీాలతో మీారిద్దరూ నీలాచలసేనానిని అర్హ మర్యాదతో నాశిబిరము చేర్చండి—నే నిప్పుడే వస్తాను—(పోవును)

శిఖ—సేనాధిపా! డిల్లీనుండి దూత ఎందుకు వచ్చెనో మీా రూహించగలరా?

నీలా—యుద్ధపరిణామము తెలుసుకొనడానికి కాబోలు.

శిఖ—అదొక కారణము కావచ్చును. పాదుషావారి జన్మదివసోత్సవము మహావైభవముతో జరుపవలసినదని కాదు గదా?

మనా—అలాగైతే రక్తపాతము లేకుండానే మన కార్యము నెరవేరగలదు.

నీలా—కేవలము ఊహాపై నాధారపడి ఆనందించ డము భావ్యము కాదు, కనుక ఇప్పుడు శిబిరముకు పోదాము—ఇప్పుడు మన మిక్కడ ఆలోచనచేస్తే ఎవరైనా విని అనుమాన

పడుతారు. మన సంభాషణ అతిరహస్యముగా చేయవలెను. కాస్త ముందూ వెనుకా చూసి కార్యము సాధించుకోవలెను.

శిఖ—నిజమే—ఇక పోదాము.

మనా—(తనలో)సేనాధిపతిపదవి నాకెన్నడు ప్రాప్తిస్తుందో !

(పోవుదురు)

---

## రెండోదృశ్యము

### అరణ్యము

(పద్మానసుడు సన్యాసివేషమున ప్రవేశించును)

పద్మా—నేడు నగరునుండి వెడలగొట్టబడి అరణ్యవాసిని నైనా నేను సుఖవంతురాలను. నాప్రాణనాధుని నరహత్యాపాపమునుండి కాపాడినానని మహానందమగున్నరాల నైనాను. ధర్మరాజు ప్రాణము రక్షించినాను; కాని యుద్ధము పరిసమాప్తమై మహారాజిక్కడినుండి క్షేమముగా స్వదేశము చేరేదాకా నా కాయనచింత మానదు. (ఫిరోజా వచ్చును.)

ఫిరో—నిశ్చింతుడవై ఉండడానికి వీలులేదు.

పద్మా—ఏమి ? ఏమి విశేషాలు ? యుద్ధవార్త లేమైన నున్నవా ?

ఫిరో—సంధిచేసినారు – పాదుషావారి వర్ధంత్యుత్సవము చూడడానికి ఢిల్లీప్రయాణ మవుతున్నారు మహారాజు గారు.

పద్మా—ఇది మంచివార్తకాదా ?

ఫిరో—ఆయన కింది ఉద్యోగస్థులు విశ్వాసఘాత చేయకుంటే మంచివార్తే.

పద్మా—విశ్వాతఘాత ఎట్లు జరుగును ?

ఫిరో—"సంధిమరతుల ప్రకారము పఠానుసైనికులను నిరస్త్రులను చేయవలె"నని మహారాజుగా రాజ్ఞాపించినారు, కాని వారి ఉద్యోగస్థులు తమ సైనికులనే నిరస్త్రులను చేసి పఠానువారి అయుధములజోలికి పోనేలేదు—దీనిని బట్టి "ఈసంధి కపటసంధి, దీని మూలముగా నీలాచలము గారు తమకార్యము సానుకూలముగా నెరవేర్చుకొనవలెనని ఎంచిన ట్లున్నద"రని నా సఖి చెప్పినది—నీలాచలముగారి ప్రతిజ్ఞాపూర్తికి పరిస్థితులన్నీ అనుకూలించినవి.

పద్మా—శ్రీజగన్నాధస్వామి ఏమి తలచినాడో! ఫిరోజా! ముకుందదేవుగారు బుద్ధిశాలులు రాజనీతిజ్ఞులు కదా శత్రువుల కాపట్యము కనిపెట్టనేరక పోయినారా ?

ఫిరో—అందుకు తగిన వ్యవధి ఏది? పాదుషావారి ఆజ్ఞానుసారము పరుగెత్తినారు.

పద్మా—ఇప్పు డేమి సాధనము? మనము జీవించి యుండగా నీలాచలముగా రిట్టి క్రూరకార్యము చేయబూనడమా? ఈ పాపము వారి కంటనీయ కూడదు.

ఫిరో—ఈశ్వరసంకల్ప మేలా గున్నదో ?

పద్మా—అదేలాగున్నా మన ప్రయత్నము మనము విడువవద్దు—పద పోదాము.

ఫిరో—రా, దూలియా నీకోసము కనిపెట్టుకొని ఉన్నది. (వెళ్ళబోతూ)

పద్మా—చూడు—ఎవరో ఇద్దరీలాగు వస్తూన్నట్లుంది.

ఫిరో—(కొంచెమాగి) వీరు కతలూ రహామతులు—కతలు ఏలాగు బ్రతికినాడు! ఇతడు మరణించెనని పుకారుపడ్డది.

పద్మా—రహమత్ చెరసాలలో నుండెనే!

ఫిరో.—ఔను కాని కొన్నాళ్ళకిందట ఇతడు పారి పోయినాడని వదంతి పుట్టింది. అతని కావలికాచియున్న జవాను అజాగ్రత్తకు ఉరితీయబడినాడు.

పద్మా—ఆ కావలి వానికి బదులు కతలుని ఉరితీయ డము న్యాయము—ఈ విషయమున ఆతడు సహాయము చేసి యుండవలెను. అదిగో వాళ్లు దగ్గరపడ్డారు. వీళ్ళిక్కడేదో రహస్యాలోచన చేయడానికి వచ్చినట్లుంది. కొంచెము పక్కకు ఒత్తిగిల్లి వీళ్లసంభాషణ విందాము—(దాగి ఉందురు.)

(కతలు రహామత్ వత్తురు.)

కత—రహామత్, ఈశ్వరానుగ్రహామువల్ల మనకో రిక లీడేరే లా గున్నవి.

రహా—ఏలాగు?

కత—ఓఢ్ర దేశమును దండెత్తేటప్పుడు నీలాచలముకు నేను ప్రధానసహాయుడ నవుతాను.

రహ—విన్నాను.

కత—అప్పుడా తనికి పరమవిశ్వాసపాత్రము నన్న

మాలే—అప్పుడు నీపక్కలో ముల్లు నూడబెరుకుతాను.

రహ—బలే! బలే! ఏమి అదృష్టము! ఏమి ఆనందము!

కత—నీలాచలము విశ్వాసఘాతియై ఉత్కళముపైకి దండెత్తె ననే వార్త వినగానే ముకుందదేవు అడావుడితో ఇక్కడికి వస్తాడు.

రహ—సరే—తరువాత?

కత—అతనికి సాయపడుతానని గట్టిగా నమ్మకము కలుగజేసి నా పక్కలోని బల్లెము పెరికి పారవేస్తాను.

ఫిరో—హా దైవమా!

రహ—([illegible]ల్లి) ఎవరి దీ కంఠస్వరము? (అడవి మధ్యకు పరుగెత్తబోవును.)

కత—ఇ దెవ్వరో శత్రువు—త్వరగా పద చంపుదాము. మనమాటలన్నీ విన్నాడు! (పరుగెత్తును.)

(ఫిరోజా పద్మాననులు వత్తురు)

ఫిరో—పద్మాననా! రక్షించు! రక్షించు!

పద్మా—ఫిరోజా! ఈశ్వరుని వేడుకో! అతడే రక్షిస్తాడు.

(పద్మాననుడు యుద్ధమునకు సిద్ధపడును, కతలు రహామతులు వత్తురు.)

కత—ఇడుగో శత్రువు.

రహ—అది ఫిరోజా!

కత—రహమత్! చంపు—లేకుంటే మనకొంప మునుగుతుంది.

పద్మా—ఫీరోజా! నీవు నావెనుక నుండు—నేను బ్రతికి ఉన్నంతసేపు నీకు భయములేదు.

రహ—బలే! ఏమి సాహసిరా సన్యాసి!

(యుద్ధము జరిగే టప్పుడు పద్మానునుని గెడ్డ మూడును.)

కత—వీడు పద్మానునుడు—కొట్టు కొట్టు వీ డసాధ్యుడు సుమా!

(పద్మానునుని కత్తి విరుగును.)

ఫిరో—ఇక చావు తప్పదు. హా! దైవమా! (మూర్ఛ)

పద్మా—పరమేశ్వరా! ఫిరోజాను రక్షించు (పారిపోవును)

కత—ఇప్పటి కీ వీడ వదిలింది!

రహ—వదల నిస్తానా? చంపి తీరుతాను (రెండు బాణములు వారిద్దరికీ తగిలి నేలకూలుతారు—వేటకాళ్లు వత్తురు.)

వేట—ఒరే! ఒకపెంటి రెండు పోతులు రోయి—పద పద (పోవుదురు.)

పద్మా—దీనబంధూ! నిజముగా నీవు భక్తవత్సలుడవు—ఫిరోజా, లే. ఈశ్వరానుగ్రహ మేలా గున్నదో చూడు.

ఫిరో—ఆశ్రితావనా! పదివేల వందనములు.

(పోవుదుదు.)

---

## మూడో దృశ్యము

గది.

దూలి—హా! తండ్రీ! నేడు నీ పుట్టిన దినము. ఎంత ఉత్సవము జరిగియుండునో! ఎంత ఆనందమో! ఇప్పు డేదీ! అన్నిదిక్కులా ఆర్తరవమే. శోకము మూర్తీభవించింది. దీనికి కారణభూతు డెవడు? రహమత్. పాపిష్టా! ఎక్కడికో పోయి నాడు! బాధ తప్పించు కొన్నాడు. ఈశ్వరవిలాస మీలా గున్నదా?

(పద్మాననుడు వచ్చును)

పద్మా—మంచిమాటే అన్నావు.

దూలి—కైది తప్పించుకొన్నాడనా మంచిమాట?

పద్మా—కాదుకాదు. కాలుని దరి కేగినాడని.

దూలి—కైదు తప్పించుకొని కాలునివాత పడ్డాడా?

పద్మా—రహమత్ వృత్తాంత మదే.

దూలి—వేళాకోళమా?

పద్మా—పరిహాసము నీతోనా? ఇదిగో ప్రభువుగారు వస్తూన్నారు—అంతా విను—నేను పక్కకు జారుతాను. (వెళ్లును)

(నీలాచలము ఫిరోజా వత్తురు)

నీలా—కతలు కూడావచ్చెనా ఫిరోజా?

ఫిరో—ఇద్దరూ ఒక్కసారే.

దూలి—ఇంకెవ రైనా వచ్చినారా?

ఫిరో—నీ తండ్రినీ సోదరునీ చంపిన నరపిశాచము రహమత్ కూడా వచ్చినాడు.

దూలి—రహమతా? ఆహా, దైవమా! ఏమి సువార్త!

నీలా—అయ్యో! కతలూ నాకు ప్రధానసహాకారి మరణించెనా? ముకుందదేవుని ప్రధానశత్రువు పరలోకప్రాప్తు డయ్యెనా? ఇక నేమి సాధనము?

ఫిరో—ప్రభూ! కతలుకై ఇంత విచారమేమి? వాడు విశ్వాసఘాతకుడు, మీపైనికూడా కుట్ర పన్నినాడు.

నీలా—నాపైనా? ఓహో! అప్రమత్తుడనై ఉంటాను.

దూలి—విశ్వాసఘాతకు లిద్దరూ ఒకేసారే వచ్చిత్తె నారు—పద్మానసా!

నీలా—పద్మానను డేడీ?

దూలి—(ఉలికిపడి) వా డేడీ! ఇక్కడినుండి తరిమివేసి నా రే మీారు—ఎలా గుంటాడు?

నీలా—(నిశ్వాసముతో) సుందర బాలకుడు—నేడే ఓఢ్ర దేశముపైకి దండెత్తనలెను. కతలు రహమతులకు బదులు శిఖమనాయిలు ముకుందదేవుకు సహజశత్రువు లున్నారు— వాళ్లసాయము నాకార్యసాఫల్యము కావచ్చును.

దూలి.—ప్రాణేశ్వరా! ఉత్కళదేశముపై దండయాత్ర మానండి—ముకుంద దేవు మీకు పరమోపకారి కాడా? తక్కిన హిందువుల దుష్కృత్యకు తగిన శాస్తి భగవంతుడే చేయగలడు. కతలురహమతుల గతి యేమైనదో కాస్త పరికించండి—పాపమునకు తగిన ప్రాయశ్చిత్తము చేసేభారము పరమేశ్వరుడే భరించగలడు.

నీలా—పరమేశ్వరుడా! అత డెప్పుడైనా నీకు కనబడ్డాడా, ప్రాణేశ్వరీ? అతనికి మనలాగే కాళ్లుచేతు లుండునా? కార్యాచరణశక్తి ఉన్నదా?

దూలి—కాళ్లుచేతులు ఉండనీ లేకపోనీ—ఆచరణశక్తి ఉందనే నా నమ్మకము. మనుష్యులే అతని సాధనములు.

నీలా—వట్టి భ్రమ, కేవల భ్రాంతి—ఈశ్వరుడే ఉంటే అదొక జడపదార్థము—కార్యాచరణశక్తి లేదు. అన్నిపనులు చేసేది మనమే...ఏది ఏలాగున్నా ఇప్పుడా చర్చతో పని లేదు. నేను త్వరలో సిద్ధముగా నుండవలెను. నాప్రతిజ్ఞ నెరవేర్చక మానను—హిందూరక్తపాతము—జాతిధ్వంసము—మతోత్పాటనము. (పోవును)

దూలి—పద్మాననా! పోకురా! (అతను వచ్చును)

పద్మా—ఏ మమ్మా?

దూలి—ఏమి చేతాము?

పద్మా—భగవంతుడే సర్వమూ నిర్వహించును. మన వల్ల నే మౌతుంది?

దూలి—నిజమే. అతడే సర్వనియంత. నేను విశ్వాస ఘాతకుడైన రహమతును చంపించవలెనని తలచియుండగా ఒక్కసారి ఇద్దరు విశ్వాసఘాతకులూ నశించడముబట్టి శ్రీ జగన్నాథస్వామి అట్లు చేసియుండునని మనము తలచవలసి నదే! అలాగే ప్రస్తుతకార్యమునుకూడా భగవంతుడే నిర్వ హించగలడు.

పద్మా—అతడే సాధనమార్గము చూపించును; కార్యము మనము నిర్వహించవలెను. ఇదిగో ప్రభువు వస్తూ న్నట్లున్నది...(వెళ్లును)

(నీలాచలము వచ్చును)

నీలా—ప్రాణేశ్వరీ, నీతో నెవరు మాటలాడుతూ న్నారు, పద్మానని కంఠధ్వనిలాగుంది.

దూలి—మీరు కలవరిస్తూన్న ట్లుంది.

నీలా—నిజమే—అహోరాత్రము అతనిమూర్తి నా కళ్లకు కట్టినట్లుంది. సేవకావృత్తిలోనున్నా నా కఠినహృదయ మును కరిగించినాడు. అతనివర్తన మంతా నా చిత్తమం దచ్చొత్తినట్లుంది. అతని స్వరమే నాచెవులకు వినబడుతూ న్నది...అదటుండనీ—నేనొక శుభవార్త వినవచ్చినది.

దూలి—ఏమిటది ?

నీలా—రామచంద్రభంజ్ నాతో కూడునని శిఖమ నాయిలు దూత నంపినారు.

దూలి—ఈ నరాధము డెవ్వరు ?

నీలా—నరాధముడా! సారంగగడమునకు రాజు, ముకుందదేవు సామంతుడు.

దూలి—ప్రాణనాథా!

నీలా—నీ విప్పుడు నాకు సలహా ఇవ్వనక్కర లేదు. నా సైన్యము సిద్ధముగా నుంది. నేను దండయాత్ర కిప్పుడే పోవలెను. పోయి వస్తాను.

దూలి—ఇప్పుడే? మీకు మహోపకారము చేసిన ముకుందదేవురాజ్యముపై దాడియా?

నీలా—ఆహా! ఇప్పుడే... (పోవును)

దూలి—(నిట్టూర్పుతో) హా దైవమా! ఇప్పుడేది వెరవు!—ప్రాణేశ్వరా! నాథా! (పోవును)

(పద్మాననుడు ఫిరోజా వత్తురు)

పద్మాననా! అంతా విన్నావా?

పద్మా—ఇప్పుడు చింతించిన ప్రయోజన మేమి? ఫిరోజా! ప్రభువుగారు వారి కర్తవ్యపాలన చేస్తూన్నారు—మనవిధి మనము నెరవేర్చుదాము.

ఫిరో—మనము కృతకృత్యులము కాగలమా?

పద్మా—పోనీ. సర్వస్వపరిత్యాగము చేసి తీరుదాము.

ఫిరో—అందు కెప్పుడూ సిద్ధమే.

పద్మా—ప్రాణత్యాగమునకు తెగించినంతమాత్రమున కార్యములేదు. కోమలాంగులైన నారీమణులకు దుఃసాధ్య

మైన పని అనగా ఏదైనా అనన్యసామాన్యమైనపని చేసి అనంతరము ప్రాణము త్యజించవలెను.

(వీరవేషమున దూలియా వచ్చును)

దూలి—అటువంటి పని చేసేటందుకే మనము బయలుదేరేది.

ఫిరో—చెలీ; నీ వేష మిదా?

దూలి—వర్తమాన పరిస్థితులకు తగిన దీ వేషమే. నీవుపోయి ఇలాగే వేషము వేసుకొని రా. సోదరా! ఈ వేషము నీకు నచ్చిందా?

పద్మా—భేషుగా నచ్చింది—భగవంతుని సంకల్పమిట్టిదే—శ్రీజగన్నాథస్వామికార్యము నెరవేర్చడానికి ప్రస్తుతమిట్టి వేషమే తగియున్నది—ఫిరోజా! మనముకూడా ఇట్టి వేషమే వేసుకొందాము నడువు. ఎలాగైనా ప్రభువుగారి మెడకు పాపము చుట్టుకోకుండా కాచి వీలైనంతవరకూ హిందూ ధర్మరక్షణము చేతాము.

అందరూ—అల్లాహో అక్బర్! శ్రీజగన్నాథస్వామికి జే!

---

## నాల్గో దృశ్యము

కొండలతో నిండిన అడవి—రాణి—సైనికులు.

రాణి—సైనికులారా! శత్రువులు సమీపించినారు—ఇంకొక్కసారి మీ రంతా "జే! శ్రీజగన్నాథస్వామికి జే" అని కేకవేసి ఈ పర్వతము పక్క కదలకుండా ఉండండి.

సేనాపతి—చిత్తము. కాని ఇదేమిటీ ఆజ్ఞ?

రాణి—నీకు బోధపర్చడానికి నా కవకాశము లేదు.

సే॥ ప॥—సరే.

అందరు—జే! జగన్నాథస్వామికి జే! జే ముకుంద దేవుగారికి జే!

రాణి—మనమంతా దాగి ఉండడము మంచి పని. (వెళ్ళుదురు)

(నీలాచలము సైనికులతో వచ్చును)

నీలా—ఈసారి శత్రువులు కంటబడకతీరదు—(చూసి) ఏడీ? ఎవడూ కానరాడే! శబ్ద మెటనుండి వినబడ్డది? సైనికులారా! కొంచెము ముందుకివెళ్లి చూడండి.

సైని—ఇక నడవ జాలము...ఏమి దాహము! నీరు! నీరు!

నీలా—(తనలో) నాకూ అదే బాధ. (నిట్టూర్పుతో) ఏమి సాధనము? ఎంత తప్పు చేసినాను! త్రోవ ముందు కానక వట్టి శబ్దమునే ఆధారముచేసుకొని శత్రులను తరుమ నిశ్చయించినాను! రామచంద్రుడు మొదలయిన మిత్రులతో నాలోచింపక ఈ దుస్సాహస మేల చేసినాను! నేను వారితో కలుస్తానన్న చోట వాళ్లు నాకోసము ఎదురు చూస్తూంటారే!

సైని—ఇంక తట్టుకోలేము (కొందరు చతికిలపడు తారు కొందరు పడుంటారు)

నీలా—గట్టి చిక్కే వచ్చింది.

తెరలో—శ్రీజగన్నాథస్వామికి జే!

నీలా—తిరిగీ అదే కేక! ఎక్కడినుంచి వస్తూన్నది? (రాణి సైనికులతో వచ్చును) సైనికులారా! ఇదిగో శత్రుసేన! ఏమి ఈ దృశ్యము! బీభత్సభయానకములతో నిండి ఉన్నది.

రాణి—సైనికులారా! యుద్ధము చేయండి!

నీలా—వీరులారా! లెండి—శత్రువులు వచ్చినారు. లేచి యుద్ధము చేయండి.

మొగల్ సైని—(లేచుటకు యత్నిస్తారు)

ఉత్క॥సై—కొట్టండి—ఇదే సమయము, నరకండి!

రాణి—సైనికులారా! ఆగండి—శత్రుసైన్యమలసి ఉంది—కత్తులు పట్టుకోవడానికైనా శక్తిలేదు—యుద్ధమునకు సన్నద్ధమై లేదు—వాళ్లు సిద్ధముగా నుండడానికి వ్యవధి ఇవ్వండి, పిమ్మట పోరవచ్చును.

సైని—మహారాణిగారూ! మహారాణిగారూ!

రాణి—ఓపిక పట్టండి.

మొగ॥ సై—అమ్మగారూ! అమ్మగారూ! మాకు యుద్ధము చేయడానికి వ్యవధి యిచ్చిన మిమ్మెంతని కొనియాడగలము? మాపై ననుగ్రహించి మొదట కొంచెము మంచినీరిచ్చి ప్రాణములు నిలుపండి—మీకు భగవంతుడు మేలుచేస్తాడు. తల్లీ దాహము! గొంతు కెండిపోయింది—ప్రాణములు నిల్చేటట్లు లేదు.

రాణి—సైనికులారా! ముందు దాహబాధ తీర్చండి.

సేనాపతి—అమ్మగారూ! వీరు మనకు మిత్రులుకారు శత్రువులు.

రాణి—ఆర్తు లందరికీ మిత్రులే—ఆర్తత్రాణ మత్యుత్తమ ధర్మము.

మొ॥ సై॥—అబ్బా! దప్పి! తట్టుకోలేము! నీరు! మంచినీరు!

రాణి—ఇప్పించు—ముందు మంచినీ రిప్పించు. ఆకలి గొన్నవారి కాహార మిప్పించు — మూర్ఛపోయినవారికి శైత్యోపచారములు చేయించు. శత్రుమిత్రవిభజనమున కిది వేళకాదు.

సేనాధిపతి—మనము తెచ్చిన ఆహారమూ నీరున్నూ అయిపోతూన్నవి.

రాణి—నావద్ద కొంత ఉన్నది—దానిని కూడా పంచిపెట్టు—మిగల్చకుండా అవసర మున్నంత పంచిపెట్టించు—

మొ॥ సై॥—అమ్మా! మీరు కేవల మానవులు కారు. భూమిపై నవతరించిన దివ్యులు! మీమాటలు విన్నంత మాత్రముననే మా ఆకలిదప్పులు అణగినవి—ఎంతో నీ రక్కరలేదు—ఆహార మవసరములేదు—(వీరందరికీ ఇస్తారు)

నీలా—నేత్రములారా! నే డేమి చూస్తూన్నారు? హృదయమా! నే డెట్టి శాంతి అనుభవిస్తూన్నావు?

రాణి—ఇప్పుడు మీవాళ్ళందరూ యుద్ధానికి సిద్ధముగా నున్నారా?

నీలా—యుద్ధమా !

రాణి—వింతగా నున్నదా ?

నీలా—ప్రాణదాత్రితో యుద్ధమా!

రాణి—మీరు వీరులు కారా? యుద్ధనీతి నెరుగరా ?

నీలా—అవసరములేదు— ప్రాణదాత్రియైన తల్లి వల్ల పరాజితులైన పిల్లలకు బిడియమా ?

(రామచంద్రుడు శిఖిమనాయీలు వత్తురు)

రామ—నాకు మాత్రము లజ్జావహాముగానే ఉన్నది. ఇదా మీ ప్రతిజ్ఞాపాలనము ? మీ మిత్రులతో కలిసి చేసిన దీర్ఘాలోచన ఏమయింది ? వీరశ్రేష్ఠుడవై ఆడదానిముందు అవనతమస్తకుడ వౌతావా ? శిఖి, మనాయి, నీలావలము చలమును నమ్మి అతనికి సాయము చేతామని ఇంతదూరము వచ్చినారే! ఏదా చలము ? అతని సాహసముచూసి నన్ను కూడా తోడు రమ్మన్నారే—ఏదా సాహసము ? ఎంత శృంగ భంగము !

నీలా—(తనలో) నిజమే. మనసు పొరగప్పి కర్తవ్యమును మన్నించినాను కాను—ధ్వంసము ! ముకుంద దేవును ధ్వంసమొనర్చు సంకల్ప మేమైనది?—(పైకి) రాజుగారూ, క్షమించండి. క్షణిక దౌర్బల్యముచేత నా కర్తవ్యజ్ఞానము పోగొట్టుకొంటిని. మీరు నాకుదోబోధము కలిగించి నా కర్తవ్యమును జ్ఞాపకము చేసినందుకు మిమ్ముకొనియాడుతూన్నాను... సైనికులారా ! లేచి యుద్ధసన్నద్ధులు కారేమి? శత్రునాశనము

సల్పండి—(రాణిగారిని చూసి) నిశ్చలులై ఏమి చూస్తూ న్నారు? నేను యుద్ధసన్నద్ధుడ నౌతానా కానా అని కాబోలు?

రాణి—లేదు, లేదు—మీరూ యుద్ధానికి సిద్ధముగా లేరు—మీశత్రువులూ సిద్ధముగా లేరు—శత్రువు లెవరు? మీరు మామిత్రులు—నేను విన్నదనముతో చూస్తూన్న దేమి టంటే “శత్రువులు మిత్రు లౌతారు, మిత్రులు శత్రువు లవుతారు” అన్నమాట సార్థకమయినది కదా, కాలమహిమ!

నీలా—ఈ త్రోవ చూపిన వా రెవరో తెలుసునా రాణిగారికి?

శిఖి—తెలిసియుండకపోవచ్చును.

మనా—నేను చెప్పుదునా?

రాణి—విశ్వాసఘాతకులారా! మీరే!

రామ—మేము విశ్వాసఘాతకులము కాము—అట్టి వాడు నీభర్త.

రాణి—మీ రలా గనడము సహజమే.

రామ—విశ్వాసఘాతకుని భార్యకు మాత్రము సహజము కాదా?

రాణి—అసత్యవాదీ!

రామ—అసత్యమా? (నవ్వి) సారంగగడముయొక్క స్వాధీనత ముకుందదేవు పోగొట్టినాడే—అ దేమి న్యాయము? స్వతంత్రరాజునైన నన్ను తన తాబేదారుకన్న చులకనచేసి నాడే, ఇది కూడునా?

రాణి—అట్లు చేయడానికి హేతువు నీ ద్రోహబుద్ధియే సుమా?

రామ—ఎలా గెలాగు? ఏమి చూసి?

రాణి—ఇప్పుడు నేను చూస్తూన్న హృద్భావమే—అందరికీ విశదమే.

రామ—ఏమి గర్వము! ఎవరు ద్రోహబుద్ధిగలవారో ఎవరు విశ్వాస్యులో ఇప్పుడే తేలగలదు.

రాణి—ఉత్కళసైనికులారా! మీ ప్రభువుగారిక్కడ లేరు—వారి యధీనమందున్న సామంతరాజూ వారి తాబేదారులున్నూ ద్రోహులయినారు. ఇప్పుడు మీకు అధికారిని నేను స్త్రీని—ఇట్టి సందర్భమున మీకర్తవ్యమును మీరే నిరూపించుకొని మీకు న్యాయమని తోచినసరణి ప్రవర్తించండి.

సైని—ముకుందదేవుమహారాజుగారి పక్షము వహించి ప్రాణములు లున్నంతవరకు పోరు సల్పుతాము—జే ముకుంద దేవుమహారాజుగారికి జే! జే! మహారాణిగారికి జే! ఉత్కళ మాతకు జే!

రామ—సారంగగడవాసులారా! న్యాయపక్షము విడిచి అన్యాయపక్షమున యుద్ధముచేయండి!

1 సైని—మహారాజా! న్యాయాన్యాయములతో మాకు పనిలేదు. మా కన్నము పెట్టి పోషించి యుద్ధముచేసే నేర్పు మాకు కలిగించిన ప్రభువు పక్షమున యుద్ధము చేస్తాము. ప్రాణములయందాశ మాకెంతమాత్రము లేదు.

నీలా—రామచంద్ర దేవా! భయము లేదు—ఇప్పటి నుంచి ఓఢ్ర దేశమునకు మీరే ప్రభువులు—కాని అయ్యో!

రాణి—సైనికులారా! ముందడుగు వేయండి. శ్రీజగన్నాధస్వామిపే రొక్కసారి ఉచ్చరించి మీవిధి మీరు నిర్వర్తించండి.

ఉ॥ సై—శ్రీజగన్నాధస్వామికి జే! ముకుందదేవు మహారాజుగారికి జే!

నీలా॥ సై—అల్లాహో అక్బర్! నీలాచలనవాబుగారికి జే! రామచంద్ర రాజావారికి జే!

(గొప్పయుద్ధము జరుగును)

తెరలో—అల్లాహో అక్బర్.

రాణి—సైనికులారా! పోరండి—వెన్నిచ్చి పరుగెత్తవద్దు—ఉత్కళము కపకీర్తి తేవద్దు—మీ జాతికీర్తి నిలబెట్టండి-మీకర్తవ్యము వదలకండి—జయపరాజయములు జగన్నాధస్వామి అధీనమందున్నవి.

తెరలో—అల్లాహో అక్బర్! నీలాచలనవాబుగారికి జే! రామచంద్ర భంజ్ రాజావారికి జే!

రాణి—రామచంద్రునికి జయమా! ఈమాట వినలేను. (పోవును)

ఉ॥ సై—అబ్బా! ఏమి ధైర్యము! ఏమిసాహస మీ రాణిగారికి!—

## ఐదో దృశ్యము

(దుర్గములో పుష్కరిణి ఒడ్డున—రాణిగారి ఎదుట రామచంద్రుని తల)

రాణి—ఆహా! జంబుకమా! సింహము లేనప్పు డాడు సింహము నెదుటనా నీ ఆర్భాటము! నీకర్మకు తగిన ఫలము లభించెను! నీ శిరమువలన నా కేమీ ఉపయోగము లేదు. నీవంటి విశ్వాసఘాతకుని ముఖము చూడడమే పాపము. నిన్ను కుక్కలూ నక్కలూ పీకుకొని తినును. ఇక శిఖమనాయి లున్నారు—వారికీ ఇట్టి దశ ప్రాప్తించునుగాక!

(సైనికుడు వచ్చును)

సై—అమ్మగారూ! యుద్ధము సంక్షేపమయినది.

రాణి—ఏలాగు పరిణమించింది?

సైని—పఠాను సైన్యము తిరిగి ముట్టడించింది మనవాళ్లని.

రాణి—భయపడక యుద్ధము చేయండి.

(2 వ సైనికుడు వచ్చును.)

2 సైని—మనకు పరాజయము! మహారాణిగారూ!

రాణి—సిగ్గులేదా! పరాజయ మన్నది తలవంపు కాదా? ఉత్కళసైనికులు జయము పొందవలెను—లేదా వీర స్వర్గము చేరవలెను. వెన్నిచ్చి పరు గెత్తరు.

(3 సైనికుడు వచ్చును).

3 సైని—మన సేనాధిపతి పడిసెను, మహారాణీ!

రాణి—సేనాపతి మృతినొందెనా? స్వామీ! నీలాచలనివాసా!...

సైనికులారా! భీతి వద్దు—నేను బ్రతికియున్నంత కాలము మీకు భయము లేదు. "యశో వా మృత్యుర్వా" అని యుద్ధము చేయండి.

(ముందుకు పోతూండగా పురనారీగణ మడ్డుపడి)

స్త్రీలు—మహారాణీగారూ! రక్షించండి! శత్రువులు మాయిళ్లలో దూరినారు—

రాణి—ఐతే నేమి? వీరనారీమణులారా! అస్త్రములు తీసుకొని మనసైనికులకు సాయము చేయండి. శత్రువులు పారిపోవలెను, లేదా వా శవములమీద నడిచి కోట చేరవలెను.

(నీలాచలము వచ్చును)

నీలా—శవములు తొక్కి కోట పట్టుకోవలెనా? సామాన్యశూరుని నొక్కని చంపినారని ఏమి గర్వపడుతూన్నారు!

రాణి—సేనాధిపా! క్షత్రియరమణి ఆత్మోత్సర్గము చేయవలసినప్పుడు ఆమె చిత్తవృత్తి ఎలాగుండునో నీ వెరుగవు కాబోలు.

నీలా—బాగా ఎరుగుదును. మీకు కూడా ఇది పరీక్షాసమయము—సైనికులారా! ఈస్త్రీలను చెరలో పెట్టండి.
(వాళ్లు ముందుకి వత్తురు)

రాణి—తుచ్ఛులారా! ఆగండి.

నీలా—మీరు జంకవద్దు—ముందుకు నడవండి—ఆడవాళ్లని జంకక చెరలో పెట్టండి. మీ పగ తీర్చుకోండి. హిందువులమచ్చ మాపండి—ఒక పురుగునైనా మిగులనీయకండి—(సైనికు లాయుధముల నెత్తుతారు).

రాణి—సోదరీమణులారా! నిర్మలమైన పుష్కరిణి ఒక్కటే మనకు శరణ్యము.

నీలా—సైనికులారా! ఈ పుష్కరిణి చుట్టవేయండి.

తెరలో—ఏమి ఘోరము! ఏమి సర్వనాశము!

నీలా—ఏమి టది? (శిఖమనాయీలు వత్తురు).

శిఖ—ఎవరో ముగ్గురు యువకులు వచ్చి మన తినుబడిసామగ్రి మందుగుండూ ఉన్న డేరాలకు నిప్పంటించి మన వారి నందరినీ చెల్లాచెదరగా తరిమినారు. దాదాపు సగము సేన నష్టమయింది.

నీలా—నా రలాగు చేస్తూంటే మీరు గాజులు తొడిగించుకొంటున్నారా! నాదగ్గరకు పరుగెత్తుకొనివచ్చి ఈ వర్తమానము తెల్పడానికి శక్తి ఉన్న మీరు ముగ్గురు బాలకులను తరుములేకపోయినారా! పిరికిపందలారా! ఈమాత్రము చేయనేరని మీరు తగుదుమమ్మాఅని యుద్ధభూమి కెందుకు వచ్చినారు?

మనా—నవాబుగారూ! ఆ యువకుల తేజ ఉత్సాహము చూచినవారికి వాళ్లు ముగ్గురూ మూడువందలమంది

లాగు కనబడ్డారు, మూడువేలన్నా అతిశయోక్తి కాదు. అదిగో ఆ మంటలు చూడండి—ఆ మొరలు వినండి—

నీలా—అంత నష్టము కలుగజేసినారా? (అందరూ పరుగెత్తుదురు.)

రాణి—ఏమి టీ వార్త! శ్రీజగన్నాథస్వామి తన సోదరుడు భార్యా వెంటరా మనల రక్షించ నవతరించెనావిమి?

తెరలో—అల్లాహో అక్బర్.

రాణి—ఇవిగో పఠానుసైనికుల జయారవములు—ఆ యువకులు పరాజితులైనారా? కాదుకాదు. మా మానరక్షణార్థము నీలాచలవాసుడు వేసిన ఎత్తిది. సోదరులారా! ఇక నాలస్యము కూడదు. ఈయవనులు మనల నంటకముందే పవిత్రములైన మన శరీరములు ఈ పుష్కరిణి కర్పింతాముపదండి.

స్త్రీలు—జేతల్లీ భగవతీ! (పుష్కరిణిలో పడుతారు)

తెరలో పద్మా—జే! జగన్నాథస్వామికి జే!

రాణి—(నిట్టూర్పుతో) పరిహాసము! జగన్నాథస్వామిపేరుపెట్టి మమ్మెవరో వేళాకోళము చేస్తున్నారు! యవనులారా! వచ్చి చూడండి—మీారు చెరలో పెట్టడానికెంత మంది మిగిలియున్నారో.

(దూలిఖా, ఫిరోజా, పద్మానుడూ వత్తురు)

దూలి—రాణిగారెక్కడ?

రాణి—ఓ యవనుడా! ఈ పుష్కరిణిలో!

పద్మా—మహారాణీగారూ!

రాణి—ప్రాణేశ్వరా! ఈ జన్మమున మీ దివ్యసుందరవిగ్రహము నాకంట పడదు, నాభీతి కార్యపరిణతమైనది—శ్రీజగన్నాథస్వామీ! నాదొక్కటే మనవి. నా ప్రాణేశ్వరుడు శక్తుడాయెనా శత్రువుల జయించి స్వాధీను డగుగాక! లేదా, యుద్ధము సల్పి పరివారసంఘముతో వీరస్వర్గము చేరుగాక!

దూలి—మహారాణీ, ఓపిక పట్టండి నేను దూలియాను!

పద్మా—నేను పద్మానుడను!

ఫిరో—నేను ఫిరోజాను!

రాణి—మీరా? ఈయోధ్ధ వేషముల నేడేల వేసినారు?

దూలి—మా కాశ్రయమిచ్చిన మహనీయురాలికి సాయము చేతామని.

రాణి—సోదరులారా! మంచిసాయము చేసినారు! మీవల్లనే మా నారీమణుల మానసంరక్షణ మయ్యెను. మీ మేలు మరువము. ఇక నే నాలస్యము చేయను.

తెరలో—అల్లాహోఅక్బర్!

రాణి—శత్రువుల కోలాహలము వినండి. ఇదే నమస్కారసహస్రము! (మృతి)

(నీలాచలమూ శిఖిమనాఖి పఠాను సైనికులూ వత్తురు)

నీలా—రాణి ఎక్కడ?

దూలి—ఈ పుష్కరిణిలో.

(అందరూ పుష్కరిణి చూస్తూండగా పద్మానుడు అతని సైదోడులు అదృశ్యులవుదురు)

# నీలాచలము

## ఐదో అంకము

### మొదటి దృశ్యము

విరజామందిరము దగ్గర

(తెరలో) అల్లాహో అక్బర్ !

(ముకుంద దేవు త్వరగా వచ్చును)

ముకు—సైనికులారా! లెండి. ప్రాతఃకాలమున పక్షి రొదలతో కలిసి శత్రువుల హుంకారధ్వని వినబడలేదా? ఇంకా ఆలస్య మెందుకు? రాత్రితో కూడా మీ నిద్రలు చాలించండి.

సైని—శ్రీజగన్నాధస్వామికి జే! ముకుంద దేవుగజపతికి జే.

(తెరలో) అల్లాహో అక్బర్! జే—కళాపాహాడ్ నవాబు గారికి జే!

ముకు—ఇక సహింపజాలను—సైనికులారా! లెండి—జగన్నాథ పేరు తలచుకొని భీషణరణభూమి నురుకుదాము రండి!

నేటి మనజయము దేశదేశాంతరములయందు ప్రసరించుగాక! లేదా మనము పరాజితులమై మన దేహములు సంతతాంధకారమున లీనమవుగాక!

సైని—ప్రభువువారికి జయము ప్రాప్తించుగాక!

ముకు—ఆహా! ఏమి ఈ దృశ్యము! ఏమి తిరస్కారము! ఉత్కళమాతా! నేడేమి నీకీ దుర్దశ? సూక్ష్మశిల్పమండితమైన నీ దేవాలయతోరణప్రదేశమేదీ? అక్కడక్కడ చెక్కబడిన కమనీయమూర్తు లేవీ! ఏమి ప్రళయము! ఓహో! ఎంత బీభత్సముగా నున్నది! నీ మూర్తిత్రయము హస్తపాదములు భిన్నమయిన వేమి? అవేల కానరావు? ప్రస్తరము మాత్రమే మిగిలినదే...? ఆది విరాణ్మూర్తులంతర్ధానమైనవా? నీలాచలమూ! నీలాచలము! నేడు నీ వెట్టి చిరకీర్తి సంపాదించినావు!

(శిఖి మనాయీలు సైన్యముతో వత్తురు)

శిఖి—కీర్తిసంపాదనము సంపూర్ణము కాలేదే?

మనా—ఒక్క జగన్నాథక్షేత్రముతో సంక్షిప్తము కాగలదా?

ముకు—మీ మరణముతోనే దానికి సంపూర్తి, విశ్వాసఘాతకులారా!

మనా—(నవ్వి) మా మరణముతోనా నీ మరణముతోనా?

శిఖ—నీ మరణమే మాకు కావలసినది—అతివిశ్వాసి అని ఎంచి నీవు కోనసింహాలుని నెత్తి నెక్కించుకొని మమ్ము తిరస్కరించినందువల్లనే మాకీ ద్రోహబుద్ధి కలిగింది—పాప మా మూర్ఖుడు పరలోకమున కేగెను. నీ వతిగారాబముగా ఆదరిస్తూన్న రాణి—పాప మామెను చూడవలెనని అనుక్షణమూ ఆశపెట్టుకొని ఉన్నావే—ఆమె కూడ ఆలోకమునకే పోయినదిలే.

ముకు—నా రాణి మరణించినదా ? ఆహా! హా! హా!

సైని—మనరాణిగారు మరణించినారా ? ప్రభూ !

ముకు—సైనికులారా ! లెండి. మరణం ప్రకృతిః శరీరిణామ్. మృత్యువువాత పడనివా రెవ్వరు ? కొందరు ముందు కొందరు వెనుక ! చింతించుట కిది సమయము కాదు—ద్రోహులారా! నా భుజబలము మీ కీదినము చవిచూపిస్తాను.

శిఖ—అందుకు సిద్ధపడే ఉన్నాము.

ముకు—యుద్ధము కానీయండి—(యుద్ధములో శిఖ మనాయీలు పడుదురు. వతానుసైన్యము పారిపోవును) విశ్వాసఘాతకులారా ! మీ ద్రోహమునకు తగినశాస్తి ఇప్పటికి ప్రాప్తించింది. (చంపబోయి) ఛీఛీ! మీవంటి నీచుల రక్త స్పర్శచేత నాచంద్రహాసము అపవిత్రము కానీయను—చంపినంత మాత్రాన మీకు సరియైన శిక్ష కాదు—మీచేతులూ కాళ్లూ నరికి మిమ్ము మొద్దులుచేయవలెను. సైనికులారా, ఈ నరాధముల నిద్దరినీ చెరలో నుంచండి. (తీసుకొని పోవు

దురు) హా! ప్రేయసీ! ఢిల్లీనుంచి తిరిగి వచ్చినతరువాత నీ దర్శనమౌనని ఎంతో ఆశతో నుంటిని—నా సేనానులే ఇలాగు విశ్వాసఘాతకు లవుతారని ఏ మెరుగుదును? వీళ్లు శత్రువులతో చేరి ఈ కపటకృత్యము కావించినందువల్ల మన కీదుర్దశ ప్రాప్తించింది.

సైని—మహాప్రభూ! కటకమునుండి దూత వచ్చినాడు.

ముకు—శత్రుసేనారహస్యములు విననలెను.

(పోవుదురు)

---

## రెండో దృశ్యము

శిబిరమున పడకగది.

ముకుందదేవు—దూత.

ముకు—ఇంకోసారి చెప్పు, విని నాజన్మ సార్థకము కావించుకొంటాను. దేవీ, నీ వియోగముకు నేను చింతించను-నీవు వీరపత్ని వనిపించుకొన్నావు! పతి యింటలేనప్పుడు సతి కావించదగిన వీరకృత్య మొనర్చి ఇహాపరములందు నుతి కెక్కినావు—ధన్యవు! నీబోటి వీరనారీమణి చెట్టబట్టి నేను ధన్యుడ నైనాను...రామచంద్రుడు విశ్వాసఘాత ఒనర్చెనా?

దూత—అందుచేతనే మన కీదుర్దశ ప్రాప్తించింది.

ముకు—రామచంద్రా! మాతృదేశమున కెంత ఆపద తెచ్చిపెట్టినావు! నీకు నాపై పగ ఉంటే నన్ను హింసించ కూడదా? నిరపరాధులైన దేశవాసుల రక్తప్రవాహముల చేత మాతృభూమిని సిక్తము చేస్తావా? వారికి పరమధనము, ఉత్కృష్ట గౌరవము, పూజనీయమైన పదార్థము—స్వాధీనత—శత్రువుల కర్పిస్తావా! వారి అమూల్యసంపద, ఖ్యాతి కాల వాలమూ ఐన సనాతనధర్మము నన్నగిల్ల చేస్తావా? ఎంత క్రూర కర్మ కొడిగట్టినావు!...ఓయీ, నీవుపోయి సైన్యము సిద్ధప రుచు—ఇప్పుడే బయలుదేరుదాము—మాతృదేశముకూ మన జాతికీ ధర్మానికీ జరిగిన ఈ తిరస్కారము చూచి సహింప జాలను.

దూత—మహాప్రభూ! ఇవి చీకటి రాత్రులు. పొద్దుటి వరకూ ఆగితే క్షేమము కాదా?

ముకు—అబ్బో! పొద్దుటిదాకానా? అంతసేపా! వీలు లేదు. నీవుపోయి సేనల కిప్పుడే నాయాజ్ఞ తెలుపుము. (వాడు పోవును) నీలాచలమూ! నీవు కొన్నాళ్లు హిందువుడవే. నిష్ఠా పరుడవై హిందూధర్మ మాచరించినావు—ఇప్పు డిట్లేల చేసె దవు? హిందువులను వాళ్ల ధర్మమునూ ధ్వంస మొనర్చ కంక ణము కట్టుకొన్నావా? (సైనికులు వత్తురు) సైనికులారా! నే నిప్పుడే బయలుదేరవలె ననుకొంటూన్నాను. మీరు సిద్ధ ముగా నున్నారా?

సైని—మీ యాజ్ఞ నుల్లంఘించగలమా!

ముకు—మీకుత్సాహము, బలమూ తగ్గినట్లున్నవే.

సైని—కొంచె మలసి యుండడముచేత ఆలాగు కన బడుతూన్నాము.

ముకు—అలసటా?

సైని—తెల్లవారేదాకా...

ముకు—సమయ మెట్టిదో చూడండి—నామాట మన్నించండి—(తనలో) నిజముగా అలసియుండడముచేత వీరి బలము తగ్గియుండవచ్చును.

సైని—మహాప్రభూ! ఏమైనా కానీ, మీఆజ్ఞ నెరవేర్చడానికి సిద్ధులము.

ముకు—పోనీ—మీరు విశ్రాంతి తీస్కొనండి. నేను కూడా అలసట తీర్చుకొంటాను. (వాళ్లు వెళ్లుదురు)

(శిఖమనాయీలు మెల్లగా బాకులు పట్టుకొని వత్తురు)

శిఖ—కొంచె మాగు! ఆగు!

మనా—ఎక్కడ పడున్నాడో చూతాము పద.

శిఖ—నీవు చప్పుడు కానీయకు, నేను చూస్తాను.

మనా—ఇదిగో ఇక్కడ ఊపిరి వినబడుతూన్నది. హాయిహాయి! గాఢనిద్రలో నున్నాడు.

శిఖ—ఈనిద్ర పెద్దనిద్ర చేతునా?

మనా—ఏదీ బాకు ఇలాగు తే—నా కడుపులో మంట ఎక్కువగానుంది, ఇతనిని చంపి దానిని చల్లార్చుకొంటాను.

శిఖ—నావాళ్ల నెందరినో చంపినాడు. ఈ హంతకుని హతముచేసి తీరుతాను. ఇదివరకు ద్వారపాలకుని రక్తము చవిచూచిన నాకత్తి దప్పి తీరలేదు. ఇతనిరక్తము కూడా చవిచూస్తే దానిదప్పి తీరుతుంది.

మనా—అబ్బా! ఎంత దుర్నిరీక్ష్యముగా నున్నది నీ మూర్తి! నీవే సమర్థుడవు.

శిఖ—ఊరకుండు—(పోవును)

తెరలో—అబ్బా! ప్రాణము పోయినది—ఓహో! శ్రీజగన్నాథస్వామీ! ఇదా నీవు చేయదలచినది?—కానీ.

---

## మూడో దృశ్యము

శ్రీజగన్నాథపురికి పోయే మార్గము.

(నాగరికులు కొందరు వత్తురు)

1 నాగ—ఓరీ! పద పారిపోదాము. ఇక నిక్కడుండ వద్దు.

2 నాగ—కొంచెమాగు—ఇంట్లో చాలా బంగారము వెండీ ఉన్నవి, తీసుకొని వస్తాను—

1 నాగ—మంచిమాటే—వెళ్లు—ప్రాణము కూడా అర్పించిరా!

2 నాగ—ప్రాణ మిస్తానా? విలువలేని నా ప్రాణము విడుతునా? అయితే పోనే పోను—పారిపోదాము పద.

3 నాగ—నా యింటిలో పిల్ల లుండిపోయినారు.

1 నాగ—ఏమి చేస్తావు? వాళ్ల నుదుటి వ్రాత ఎలా గుంటే అలాగు జరుగుతుంది. మన ప్రాణ మొకటి నిలబడనీ.

(తెరలో) అల్లాహో అక్బర్! జే! నీలాచలనవాబుకి జే!

అందరు—నీలాచలము వచ్చినాడు రా!

(పారిపోతూండగా దూలియా అనుచరులతో వాళ్ల నటకాయించును)

పద్మా—నిలువండి పోకగులారా!

అందరూ—నీకు నమస్కారము—మా ప్రాణములు రక్షించు—మమ్ము కాపాడు!

1 నాగ—మహాప్రభువులారా! నా ఆస్తి అంతా తీసుకొని నా ప్రాణము మాత్రము కాపాడండి.

2 నాగ—నా బంగారము వెండి అంతా ఇచ్చివేస్తాను; నన్ను చంపకండి!

3 నాగ—నా పిల్లాజల్లా తీసుకొని నా ప్రాణము మాత్రము కాపాడండి!

పద్మా—ఏ మన్నారు? తుచ్ఛములైన మీ ప్రాణాలు రక్షించుకోవడానికి మీ బంధుగుల నందరినీ శత్రువుల కర్పిస్తారా? మానుషత్వము విడువడానికి కూడా సిద్ధపడ్డారా? మీరు మానవులా లేక మానవరూపము దాల్చిన పశువులా? మీ సుఖమే ముఖ్యమని యెంచి—మీ వివేకమంతా పోగొట్టుకొని—మీ నాశనము, మీ ధర్మనాశము కావించుకొన సిద్ధ

పడ్డారా? ఛీఛీ! ఏమి పౌరుషము, ఏమి జీవనము— కాల్చనా?

(భయముతో ఒకరినొకరు చూసుకొంటారు)

దూలి—భయము లేదు. మేము శత్రువులము కాము, మీకు మిత్రులము—

అందరు—మిత్రులా?

దూలి—ఔను మిత్రులమే—మీ సాయము కోరి వచ్చినాము—

1 నాగ—సాయమా! మా వద్ద నేమున్నది?

దూలి—మీకు లేని దేది? సోదరులారా! మీ దేహములందు బలముంది, హృదయములందు సాహసముంది. మనస్సునందు దార్ఢ్యముంది. అవే మాకు కావలసినవి.

2 నాగ—మాకవేవీ లేవండోయి! మమ్మెందుకు చిక్కులలో తోస్తారు?

దూలి—మీకు గుడ్డివాళ్లా, చెవిటివాళ్లా? చూడండి— మీ యిళ్లెలాగు మండుతూన్నవో—పవిత్రమైన మీ దేవాలయములు ధ్వంసములై రాతిగోడలు, స్తంభములు మాత్రము మిగిలియున్నవి—మీ బంధువుల ఆర్తనాదము లెలాగు మిన్ను ముట్టుతూన్నవో వినండి—భూమి కంపిస్తూన్నది, ఆకాశము బద్దలౌతూన్నది. లెండి—మేల్కొండి—ఆయుధము లెత్తండి.

అందరు—అయ్యా! మమ్ము మేల్కొల్పిన మహాత్ములు మీ రెవరు?

తెరలో—అల్లావాహో అక్బర్ !

దూలి—శత్రువుల జయధ్వనులు వినబడుతూన్నవా? రండి. ఎవరి కేది దొరికితే దానితో రండి, శత్రువులతో పోరు దాము—చా వెప్పుడైనా ఉన్నదే—ఒక్కసారి చస్తాము గాని రెండుసార్లు చావము కదా—ఈపాటిదానికి పగరకు వెన్నిచ్చి పరుగెత్తి పిరికి పందలనిపించుకో నేల ?

పద్మా—శ్రీజగన్నాథస్వామికి జే! అని కేక వేయండి.

అందరు—శ్రీజగన్నాథస్వామికి జే! నీలాచలనివాసునికి జే!

---

## నాల్గో దృశ్యము

### శ్రీజగన్నాథస్వామి ఆలయము.

(పండా లందరూ భయముతో కర్రలు పట్టుకొని యుందురు)

1 పండా—ఇక రక్షణ మశక్యము. యవనులు దగ్గర పడ్డారు.

2 పండా—శత్రుసేన సముద్రతరంగమువలె పొంగి వస్తూన్నది.

(తెరలో అల్లావాహో అక్బర్ అని కేకలు)

3 పండా—స్వామీ శ్రీజగన్నాథా! నిన్ను నీవే కాపాడుకోవలెను. ఇక మాకు శక్తిలేదు (పారిపోవ సిద్ధపడు దురు)

(దూలియా పద్మానసుడునూ కొందరు పౌరులతో వత్తురు)

దూలి—శక్తి లేకేమి? మీరందరూ ఇష్టదేవతా నామ ముచ్చరించి దేవకార్యమున కృతకృత్యు లవుటకు సిద్ధముగా నుండండి.

1 పండా—మీ రెవరు? దేవప్రేరితులై వచ్చినట్లుంది!

2 పండా—వీరు తప్పకుండా దేవదూతలే.

అందరూ—శ్రీజగన్నాథస్వామికి జే!

తెరలో—అల్లాహో అక్బర్!

(నీలాచలము సైన్యముతో వచ్చును)

నీలా—హిందువులారా! మీ కేటి ఆశ! తోక తొక్కిన నల్లతాచు కరవకుండా కాచుకో గలరా! జాజ్వల్యమానమైన నా క్రోధాగ్నిలో పడకుండా మీ దేవుడిని కాచ గలరా? చుట్టుపట్ల నుండు ప్రదేశ మంతా శ్మశానము చేసి నాను చూసినారా? మీవారి శవముల పోగులు భూమి కెంత భారమైనవో చూడండి. వాళ్ల రక్తముచేత సముద్ర మెంత ఎర్రబారినదో చూడండి. మీవాళ్ల మొర్రలు సముద్రగర్జనము నణచి ఏలాగు మిన్ను ముట్టుతూన్నవో చూడండి. మీ దేవాలయములలో శంఖములు గంటలూ, మోగుటకు మారుగా పిశాచధ్వను లేలాగు వినబడుతూన్నవో వినండి. ఇం కేటి ఆశ మీకు?

1 పండా—నవాబుగారూ, రక్షించండి. మా సర్వస్వమూ తీసుకొని మాఆలయము మాత్రము కాపాడండి.

నీలా—ఆలయము కాపాడవలెనా? సుశ్రోత్రియబ్రాహ్మణుడ నైన నేను చండాలుడ నవుట కీ గుడియే కారణము. వివేకిని పండితుడ నైన నేను పిశాచము నవుట కిదే కారణము-దీనిని రక్షిస్తానా? నాకెంత అధఃపతనము చేకూర్చింది! దీని నుండ నిస్తానా? కల్ల! కల్ల!

పద్మా—నవాబుసాహెబా! దోషులను దండించవలెను కాని దేవాలయ మేమి చేసింది? దానిని మీరు పడగొట్టుతారేమి?

నీలా—దోషులను దండించడాని కిదే మార్గము.

దూలి—ఇది హిందూ మతమునకు శిక్ష కాని దోషులకు కాదు.

నీలా—నా ఉద్దేశము కూడా అదే—హిందువులను నాశనము చేయవలెను.

దూలి—నవాబుగారూ!

నీలా—ఇక నే నేమీ వినను. నా ప్రతిజ్ఞ నెరవేర్చితీరుతాను. సైనికులారా! ఆలయములో ప్రవేశించి విగ్రహముల నన్నిటిని ముక్కముక్కలు చేయండి. హిందువుల కతిప్రీతిజనకమూ వాళ్ల మతానికి మూలకందము, గర్వానికి ఆలవాలము నైన జగన్నాధ విగ్రహము నిటు ఈడ్చి తెండి. హిందూశిల్పచాతుర్యమున కాటపట్టైన ఈ గుడిని పడగొట్టి గుడ్లగూబల కిమ్మవై నట్లు చేయండి. అంతతో ఈ మతము మట్టిలో కలుస్తుంది.

పద్మా—మా కంఠములలో ఊపిరున్నంతవరకూ ఆపని జరుగనీయము.

నీలా—ఇంత పట్టుదలా? లాభము లేదు. సేనాసముద్ర ప్రవాహము నరికట్టడము మీకు శక్య మగునా? ఊరక ప్రాణ త్యాగ మెందుకు చేస్తారు? నాలుగుకాలాలు బ్రతకండి... సైనికులారా! లోపలికి వెళ్లి మీపని మీరు చేయండి.

పద్మా—మే ముండగా ముందుకి రానీయము (యుద్ధ మగును, పద్మానుడు దెబ్బతగిలి పడిపోవును)

నీలా—లోపలికి పొండి.

దూలి—నేను మిమ్ము పోనివ్వను.

నీలా—నీ సైదోడుగతి ఏ మయ్యెనో చూడు—వృథాగా ప్రాణము పోగొట్టుకోకు.

పద్మా—ఒంట్లో శక్తి ఉన్నంతవరకూ హృదయమున సాహస మున్నంతవరకూ శత్రువును సూదిమొన మోపినంత దూరమైనా ముందుకు రానీయకుమా.

దూలి—బ్రతికి ఉన్నంతవరకూ నీమాట ప్రతి అక్షరమూ జరిపి తీరుతాను.

నీలా—సైనికులారా! ఈ మూర్ఖత్వ మెంతకాలము సైరిస్తారు? ముందుకు నడవండి—(దూలియాను కత్తితో కొట్టి సైనికులతో ఆలయములోనికి పోవును)

ఫిరోజా—సఖీ! సఖీ!

దూలి—అబ్బా! ప్రాణము పోయేట ట్లుండి—హా! ప్రాణేశ్వరా! దప్పి! దప్పి! ఫిరోజా! కొంచెము నీరు తే.

ఫిరో—పద్మాననా! పద్మాననా! సఖి యెట్టి దుర్దశలో నున్నదో చూడు.

పద్మా—సోదరీ! సోదరీ!

దూలి—పద్మాననా! కొంచెము నీరు!

పద్మా—శత్రువు లేరీ? ఏదో గందరగోళ మవుతూన్న ట్లుంది. ఫిరోజా! సఖిని పట్టుకో, ఇక్కడ మన మాగకూడదు.

(దూలియాను తీసుకొని పోదురు)

---

## ఐదో దృశ్యము

### సముద్రతీరము.

(చితాగ్ని మండుతూండగా హిందువులు భయవిహ్వ లులై చూస్తూందురు, తురకలు జగన్నాధస్వామిమూర్తిని పట్టుకొని ఆనందిస్తూ ఉందురు. పక్కనే నీలాచలము నిల బడును).

నీలా—అగ్నిహోత్రుడా! మండు. హిందువుల ఎముక లను పొడిచేస్తూవ్నావు, రక్తము తాగుతూన్నావు; వారి మజ్జ నీలో హుత మాతూన్నది. నీ కడుపు నిండుతుంది, నా కోపాగ్ని చల్లారుతుంది. సైనికులారా, అగ్ని ఏడునాలుకలూ

తీటుతూన్నది, జ్వాలలు పెరుగుతూన్నవి. హిందువుల గర్వాస్పదమైన ఆ విగ్రహ మిలాగు తెండి. ఈ కర్ర యొద్దు వాళ్ల ప్రాణములకు ప్రాణము. ఒక్క క్షణములో హిందువుల సర్వస్వము భస్మీభూత మవును, నా కోర్కె సఫలమవును.

సైని—అల్లాహో అక్బర్ ! (జగన్నాథమూర్తి నగ్నిలో పడవేసి పోవుదురు)

హిందు—హా! జగన్నాథస్వామీ ! నీలాచలనివాసా!

(పద్మాననుడు త్వరగా వచ్చును)

పద్మా—ఊరక ఏడ్చి ప్రయోజన మేమి (మంటమధ్యదునికి జగన్నాథమూర్తిని పైకి తీసి) ఇదిగో శ్రీజగన్నాథమూర్తి, తీసుకొని పొండి.

హిందూ—జే! జగన్నాథస్వామికి జే (పోవుదురు)

పద్మా—ఇంక నిలబడలేను.

నీలా—వింత బాలకా ! ఎవడవు నీవు ?

పద్మా—ప్రభూ !

నీలా—పద్మాననా !

పద్మా—(పాగాతీసి) ప్రాణేశ్వరా ! (పడిపోవును)

నీలా—తిలోత్తమా ! తిలోత్తమా ! ప్రాణేశ్వరీ ! (ముందుకి పోవును)

తిలో—ప్రాణేశ్వరా ! మీ చరణదాసి చేయవలగిన పని పూర్తియైనది. ఇక నాకు సెలవు దయచేయండి.

నీలా—సెలవి మ్మన్నావా ?

తిలో — ఇక కార్యము లేదు.

నీలా — కార్యము లేదూ!

తిలో — ఆ విషయము తెలుసుకొని లాభమూ లేదు. ఈ దాసియెడ మీ అనుగ్రహముంచి శాంతిభిక్ష దయ చేయండి.

నీలా — క్రోధమాత్సర్యసంక్షుభితమైన ఈ హృదయము శాంతిభిక్షా ప్రదాన మేగాగు చేయుగలను?

తిలో — ప్రభూ! ఈ నృశంసకార్యమునుండి నివృత్తులు కావలయునని నా విన్నపము. దీనబాంధవుడైన శ్రీ జగన్నాథస్వామి కృపావృష్టి కలిగించే మార్గము చూస్తిరా మీచిత్తక్షోభ తప్పకుండా తగ్గిపోవును.

నీలా — అసంభవము. చిరప్రఫుల్లపద్మాననము లేని నాడు నాకు చిత్తశాంతి చేకూరదు. ధర్మనిష్ఠకర్తవ్యపరాయణ అయిన తిలోత్తమ లేకుంటే నాకు శాంతి ఎక్కడిది?

తిలో — అట్లనకండి — పతిపరాయణ దేవీతుల్య అయిన దూలియా ఉన్నంతకాలము మీకు శాంతి సంభవించితీరును. హా! దూలియా! సోదరీ! ఈ సమయమున నిన్నుచూసే భాగ్యము నాకు లేకపోయింది.

(దెబ్బ తిని దూలియా వచ్చును)

దూలి — ఏడీ ప్రాణేశ్వరుడు? ఇక్కడ వేంచేసి ఉన్నాడు! ఆహా! నా ప్రాణేశ్వరుని చరణపద్మములను చూడగలిగినాను— ఏమి నా భాగ్యము! ధన్యోస్మి! ధన్యోస్మి!

నీలా——దూలియా! దూలియా! నీ విక్కడి కేలాగు రాగలిగినావు? ఈ వేష మెందుకు నీకు? ఈ దుర్దశ ఎలాగు ఘటిల్లినది?

దూలి——ఇది నాకు సుదశ! ప్రభూ! భర్త నిట్టి దుర్దశలో చూడడముకన్న పత్ని ఈ దశలో నుండడము సుదశ కాదా? ప్రాణేశ్వరా! ఇంక కూర్చోలేను. (పరుండును)

నీలా——దూలియా! దూలియా! కాదు. తిలోత్తమా! తిలోత్తమా!

దూలి——తిలోత్తమా! ఏదీ? ఏదీ?

తిలో——ఇదిగో, ఇక్క ఉన్నాను, సోదరీ!

దూలి——ఎక్కడ? ఇడుగో పద్మాననుడు——ఇ దేమిటి, తిలోత్తమ ఏదీ?

తిలో——తిలోత్తమను పోల్చుకో లేకున్నావా?

దూలి——హా! తిలోత్తమా! సోదరీ! (పండుకొని కౌగిలించుకొంటారు)

తిలో——సోదరీ మనపని పూర్తి అయింది. శాంతి దాత నిక ఆశ్రయించుదాము—ప్రాణేశ్వరా! నీ దాసులకు సెలవు! శ్రీజగన్నాథస్వామీ——మా ప్రభువు బుద్ధి మంచి మార్గము పట్టేటట్లు చేయుము. ఇదే మా ప్రార్థన (మృతి)

దూలి——ప్రాణేశ్వరా! మీకు శుభమవుగాక! సెలవు సెలవు—(మృతి)

నీలా—ఇద్దరూ నిశ్చింతులైనారు — నీలాచలము కూడా నిశ్చింతుడైనాడు—ఎవరు నీవు? నీకు భయము లేదా? నీలాచలము నిర్భయుడు కాడా? చూడు, చూడు—ఈ చేతిని హిందువుల రక్తము—ఈ చేతిలో హిందువుల మాంసము—ఒకచేతిని తిలోత్తమ రక్తము రెండోచేతిని దూలియా రక్తము. భయము లేదా నీకు?...ఏమిటీమూర్తి! నోరు తెరచుకొని నన్ను మింగడానికి పరుగెత్తి వస్తున్నది! ఆగు! ఆగు! కొంచెము సేపాగు (కళ్లుమూసి) ఏమి అట్టహాసము! ఏమిటీ ఆర్తనాదము? ఊరుకో! ఊరుకో! (చెవులు మూసి) ఏమి బాధ! శాంతించు! శాంతించు. (గుండె మీద చేయివేసి) ఇక్కడ శాంతి లేదు—ఇక్కడ శాంతి లేదు.

(వేగమే బయలుదేరగా ముకుందదేవుని శిరస్సు
పట్టుకొని శిఖ మనాయీలు వత్తురు.)

శిఖ—(శిరస్సుచూపి) ఇక్కడ అగ్ని ఉన్నది ప్రభూ!

నీలా—(చూసి భయముతో వెన్కకు పోవును.)

మనా—భయము లేదు—ఇందు ప్రాణము లేదు.

నీలా—చచ్చిన శిరస్సా! కాదు కాదు. జీవ మున్నది. అదిగో కన్నెర్రచేసి చూస్తూన్నది! అదిగో నోరు తెరుస్తూన్నది. (కళ్ళుమూసి) నా ఎదుట నుంచకండి, తీసుకొని పొండి.

శిఖ—తీసుకొని పోనా? పురస్కారము పుచ్చుకోకుండానే!

మనా—పురస్కార మిప్పించండి, ప్రభూ! మీ కోర్కె నెరవేర్చినాము. మీ ప్రతిజ్ఞ సార్థకము చేసినాము.

నీలా—ఔను—మహత్కార్యము చేసినారు, కావున మీకు అర్హపురస్కార మివ్వవలసినదే—సైనికులారా! ఈ యిద్దరినీ ఆవలకు తీసుకొని పోయి రాజద్రోహులకు దేశద్రోహులకు జాతిద్రోహులకు తగిన శిక్ష విధించి రండి.

శిఖనాయకులు—సలాము సాహెబుగారూ!

నీలా—నా ఎదుట నిల్పక కదిలి వేగ వీరావలకు కొని పొండి—(పోవుదురు)

ఆహా! తగిన పురస్కారమే లభించింది. ముకుందదేవ మహారాజా! అంత తీవ్రముగా నావైపు చూడకు—నేను హిందూద్రోహిని కాను—హిందూరక్తపిపాస నాకు లేదు. దూరియా, మెల్లగా మాటాడు; కేకలు వేయకు. నేను పత్నీఘాతకుడను కాను, నేను నరపిశాచిని కాను. తిలోత్తమా, నన్ను తిరస్కరించకు, నామెడ ప్రసన్నవగుము. నేను ధర్మత్యాగిని కాను......ఏమంటివి? ఏమంటున్నావు? నేను స్త్రీత్యాగిని—స్త్రీహంతకుడను...—ధర్మత్యాగి నంటున్నావా? ఏమిటిది? మండుతూన్న అగ్నికుండమా? కాగుతూన్న చమురుతో నిండిన బాన. ఇవన్నీ నా కోసమే? నన్ను శిక్షించడానికే! అసంభవము—నేనా దోషిని? నాకు శిక్ష అవునా? నేను నిరపరాధిని—నేను ధర్మాత్ముడను—నాకు పురస్కారము రావలె.

సైని——మహాప్రభూ! శిఖ మనాయీలు శిక్షింపబడ్డారు——వారి శిరస్సులు నరికినాము. (పోవుదురు)

కలా——ఇదా నా పురస్కారము?...ఎవరికీ అధికారము లేదు. ఎవరికీ ప్రాప్యములేదు. హింస జరిగినదా? నావలెనెవ్వ రుపచరించును? నాబోటి కర్తవ్యపరాయణు డెవడు? హా హ్హా హ్హా! ఎవడూ కాలేడు. ఆ సామర్థ్యము లేదు...లోభమెలాగు? హింస ఎలాగు? చూచిపొండి. స్థూపీకృతమైన నా పురస్కారము చూచి పొండి——శిలోత్తమ శవమే నాకు పురస్కారము——దూలియూశవమే నాకు పురస్కారము——శిఖ మనాయిల శిరస్సులే నాకు పురస్కారము! ముకుందదేవు మస్తకము నాకు పురస్కారము——హిందూ శిల్పనాశనము నాకు పురస్కారము—హిందువుల స్వాధీనతానాశనము నా పురస్కారము.

సమాప్తము.